రదాగ్రంథమాల

శ్రీ

ప్రథమ కుసుమము.






గ్రంథకర్త
శిష్టా వేంకటసుబ్బయ్య
పైలదున్నత పాఠశాలాంధ్ర పండితుఁడు.



1940



[ వె 1—0—0.

# పీఠిక.

కావ్యమెంత శ్రవణానందదాయకమైనను బాత్రౌచితిఁ దొలంగి రసాభాసమైనచో విద్వద్వరేణ్యుల వీనులకు విందొనర్పఁజాల దనుటకు సందియము లేదు. రసౌచిత్యములకిక్కయై హృదయానంద దాయకమై నీతిబోధకమైన కావ్యమునే మదినూని 'విశ్వశ్రేయః కావ్య'మ్మనిరిగదా వాగ్మికులు. ఏతద్రసౌచిత్యపోషణలకుఁ బ్రాచీన కవీంద్రులవలంబించినపద్ధతు లాయా గ్రంథములనవలోకించినఁగాన నగును. విక్రమోర్వశీయమునందలియూర్వశియు, మృచ్ఛకటికము లోని వసంతసేనయు నిందులకు బలవత్తరతార్కాణములు.

నేనీహృదయాభిరామమను ప్రబంధమును రచించి చాలకాల ముంచితిని. నామిత్రులనేకు లనేకపర్యాయములు వినియానందించి ముద్రితముగాకమున్నె దీనినిఁ బ్రశస్తికిందెచ్చిరి. దానికి ఫలంబుగా ది 11—3—40. తేదీని భద్రాచలము కుమారరాజావారగు శ్రీ రాజా వేంకటనరసింహాప్పరావు బహదర్ వారి యొద్దనుండి “అయ్యా! మీరు రచించిన వాసవదత్తాదిగ్రంథములు మాకు లభించినవి. చదివి మిక్కిలియానందించితిమి. మీహృదయాభిరామప్రబంధ ప్రాశస్త్యమును శ్రీశాస్త్రిగారివలన వినియున్నాము. మీయవకాశము చూచుకొని గ్రంథము దీసికొని రాఁగోరుచున్నాము” అని లేఖవచ్చి నన్నానందాబ్ధిముంప “అయ్యా! నేనిచ్చటమైలరున్నతపాఠశాలకధ్యక్షుఁడ నౌటచే స్వాతంత్ర్యమును గోల్పోయి మీయుత్తర మందినతక్షుణమే రానవకాశము లేనివాఁడనగుట మన్నింపఁగోరెద. ఒకవారములో దర్శించెద” నని వ్రాసి యూవెనుకఁ జెన్నపట్టణము పోయి దర్శింప 'దీనియచ్చుఖర్చు రూ 250—0—0 లును మేమిచ్చెదము.

ఏదేవునకైన నంకితమిం'డని తమయౌదార్యంబు మెఱయఁ బలికిన 'మీ కేలగ్రహింపరా'దని నేనుకోరఁగా 'నరాంకితము నింద్యమని పోతన వచింపలేదా? రాజులకు రాజు విష్ణువునకొసంగుఁ'డనివచించిన వారికిసమాధానపురస్సరంబుగా

ఉ. పోతనదృష్టిలోనఁ గవిపుంగవలోకము లోకరక్షకుం
డై తగుశౌరికే కృతుల నర్థి నిడవలెనన్నమాట స
త్యేతరమౌనె? కాని యొకయించుకయించుక పోల్చిచూడ నా
వ్రాఁతలలోనిసూక్ష్మమగువ్రాఁత యిదేయని తోఁచదే నృపా!

ఉ. పోతనకాలమందుఁగలభూపతులెల్లఁ గిరాటకీచక
వ్రాతముతోడి పొత్తుగలవారని తత్కవిచంద్రు పద్యమే
యాతతఘంటికాధ్వనుల నల్లనల్లన మ్రోయు నట్టిభూ
నేతల కమ్మనం చనుట నీతికి బాహిరమే నరేశ్వరా!

శా. శ్రీవిష్ణుప్రభుపేర నంకితమె వర్ధిష్ణుత్వమం జాడుదేఁ
"నావిష్ణుఃపృథివీపతిః" యనఁగ భూనాథాగ్రణీ! నీవు ము
న్నే విన్నాఁడవుగాన నీకొసఁగుచో నేతత్ప్రబంధంబు నా
దేవాధీశునకిచ్చినట్టులగుఁగాదే నిక్కమూహింపఁగన్.

సీ. పుట్టఁబుట్టినవాఁడు పట్టి వ్రాయునుగదా!
రామచంద్రునికథల్ ప్రకటమయ్యె
నోడఁబోల్చినవాఁడు పాడనేర్వనుగదా!
ధర్మజాదులకీర్తి ధాత్రి నిల్చెఁ
గాళిఁగొల్చినవాఁడు గల్పించుటంగదా!
భోజరాజు యశంబు బూరటిల్లె
నన్నపార్యుఁడు మున్ను సన్నుతింపనుగదా!
రాజనరేంద్రుండు ప్రణుతికెక్కె

గీ. పూని శ్రీనాథకవిరాజు పొగడకున్న
రాజు వీరభద్రారెడ్డి తేజమేది?
పెద్దనాదులగ్రంథాలు వెడలకున్నఁ
గృష్ణరాయలపేరేది? కీర్తినిలయ!

ఉ. యత్నమొనర్చి కాలమనునాస్తి వ్యయించుచుఁ గావ్యనామ స
ద్రత్నముఁ గూర్చితిన్ గవికి రాజులకున్ గలబాంధవంబనన్
బ్రత్నము కాదునేటిది కరంబు గ్రహింపుము కావ్యకన్యకా
రత్నముఁదాల్చురాజులు విరాజిలుచుండరె? కీర్తికాయులై.

చ. తిరుమలదేవిసన్ సతిగ ధీరుఁడు రాయలు గొన్న నాటకం
బరయ మహాద్భుతంబయిన దాపయినన్ హృదయాభిరామమన్
వరకృతిరాజమొండు నిఁక వాసవదత్తయనంగ సద్రసా
కరమయి యచ్చుపడ్డది యొకండల గద్యము లుండు మొదుగన్.

మ. వినిపింపంగలవాఁడ నిన్నియును మీవీనుంగవన్ విచ్చుచున్
వినఁగాఁ దీరికగల్గి నచ్చి మది కెంతే మెచ్చుఁ బుట్టించుచో
ననుపన్ రాఁగదె యంకితమ్మునకు మీస్వాంతంబు మోదాబ్ధిలో
మునుఁగంజాలదయేని విన్నపిదపన్ భూపాల! యేనేగెదన్.

చ. గుడు లొకకొంతకాలమునకున్ భువిఁగూలు వనవ్రజంబులున్
జెడును తటాకముల్ పొలియుఁ జీలి నశించు మహాగ్రహారముల్
చెడును సమస్త మొక్కపుడు చెప్పెడిదేమిఁక లోకముల్ చెడన్
జెడనిది యొక్కసత్కృతియ! చిత్తమునం దలపోయు ధీమణీ!

అనుభావపరంపర వెల్లడింప నంత నతిశ్రద్ధమెయి శ్రీరాజావారీ గ్రంథము నాలుగున్నరగంటలకాల మేకథాటిని వినియానందించి "మేమీగ్రంథ మంకితముదీసికొనెద" మని మచ్చిత్తరంజకంబుగా వచించి హస్తపద్మంబులఁ గర్పూరతాంబూలంబు గైకొని "ఉచిత

భక్తియన్నట్లు" దీనినిగ్రహింపుఁడని నాకరంబులనిడి మోటారుపై నెక్కించుకొనిపోయి నాయునికిం జేర్చి యమందానందం బొడఁగూర్చిరి. అట్టి కవితారసజ్ఞు దీనికిఁ గృతినాయకునిం జేయుట మద్భాగ్యంబని వాకొననేల?

ఆధునికకాలంబునఁ బూర్వప్రబంధంబుల చందంబున వర్ణనోపాలంభనేత్యాదులకు దేవులాడవలసిన యవసరములేమి నయ్యవి యిందుండి తొలంగించితి. 'బీచి' మొదలగునాంగ్లపదంబులనుఁ దర్జుమాచేసిన 'వినాయకునిఁ జేయఁబోయినఁగ్రోఁతి' యయ్యెనన్నసామ్యంబుగా వికారాకారము లేర్పడుననుట రసజ్ఞుల కెల్లరకు విశదమే కావున 'బీచి' కోర్టు, డిక్రీ, లవర్సుపాత్, సీసిక్నెస్, ఇత్యాద్యాంగ్లపదప్రయోగంబులును రసపోషణ కందందు 'అసలే, చిత్తే' ఇత్యాది వ్యావహారికపదప్రయోగంబులును గన్పట్టుచుండు. 19 వ పుట 7 వ పంక్తిలో "పతుల యదృష్ట" - 22వ పుట 1వ పంక్తి "మఱుసటి"- 41 వ పుట 6 వ పంక్తి "పడపుఁ గొమ్మల"- 65 వ పుట 11 వ పంక్తి "గొల్లలాడఁగఁజాలు" 102 వ పుట 16 వ పంక్తి "యూర్జితంబయిన" అని సవరించి చదువఁ బ్రార్థితులు. ఇంకను సవరింపవలసిన ప్రమాదంబు లుండవచ్చును. రసగ్రహణపారీణులు గుణంబున్న గ్రహించి దోసంబులవిడిచి మన్నింపవేఁడుచున్నాను.

నరసాపురం,
2—8—1940.

బుధజనవిధేయుఁడు,
శిష్టా వేంకటసుబ్బయ్య.

శ్రీరస్తు.






# ప్రథమాశ్వాసము.




యుతమై విమృష్టసువిశేషకమై సురతాంతతాంత ర
మ్యాయతనేత్రమై ప్రవిచలాలకమై హృదయాభిరామమై
తోయజపత్రనేత్రునకుఁ దోరపుమోద మొసంగునట్టి ల
క్ష్మీయువతీముఖాంబుజము శ్రేయము మత్కృతిభర్త కిచ్చుతన్.

శా. శ్రీజాయాకుచకుంభసంభృతలసచ్ఛ్రీగంధకస్తూరికా
రాజార్హాదిసుగంధవస్తుచయపారావారగేహాఢ్యుఁడౌ
రాజీవాక్షుఁ డఖండసంపదలతో రాజిల్లుదీర్ఘాయు వీ
రాజా వేంకటనారసింహునకు నశ్రాంతంబుఁ జేకూర్చుతన్. 2

చ. శిరమునఁ గేకిపింఛమును జిన్నరిపొన్నరిచందమామయున్
గురుమణికుండలమ్ము ఫణికుండలమున్ జెవులందుఁ గాంచనాం
బరముఁ గళాస మిద్ధకటిభాగమునందు వెలుంగుమూర్తి యా
హరిహరనాథుఁ డోముతఁ జిరాయు వొసంగుచు నప్పరాయనిన్.

గీ. దైవతాధీశమౌళిమందారకుసుమ
బృందనిష్యందిమకరందమందుఁ దవులు

రుచిరహేరంబపాదాంబురుహరజంబు
విఘ్నజలరాసులను బీల్చి వేయుఁగాక! 4

గీ. బహుళమృదులపదాంచితసహజగత క
విత్వతత్త్వకోవిదుని వివేకధనుని
నఖిలవేదాంతరార్థవిన్యాసు వ్యాసు
నైదుపదిచేసి నుతియింతు నధికభక్తి. 5

చ. కొలిచెద వామలూరుసుతుఁ గోవిదచంద్రులఁ గాళిదాస మా
ఘుల శివభద్ర చోరకవికుంజరులన్ జయదేవ భారవిం
ద్రుల భవభూతి హర్షులను దోరపుభక్తిని భట్టబాణులన్
లలితవచోవిజృంభితవిలాసకవిత్వపటుత్వశోభకున్. 6

గీ. నన్నపార్యున కాదివందన మొనర్చి
సోమయాజునికీర్తి హృత్సీమ నిలిపి
సరసు శ్రీనాథకవినాథు సంస్తుతించి
యభినుతించెదఁ దక్కినయాంధ్రకవుల. 7

సీ. సచ్ఛాత్రనికురుంబసరసీరుహాళికి
ద్వాదశాత్ముని భంగిఁ దనరువాని
సంస్కృతభాషావిశారదచాతక
పటలికి సృష్టిమై పరఁగువాని
లసదలంకారశాస్త్రసముపేతపికాళి
కెల్ల వసంతమై యెసఁగువానిఁ
బ్రథితతర్కవ్యాకరణవేద్యబుధులకు
సురగణాచార్యుఁడై వఱలువాని

గీ. 'నన్వయశిఖామణి'యటంచు నంది బిరుదు
సేతుశీతాద్రిమధ్యవిఖ్యాతుఁడైన

యమలవేమూరివంశదుగ్ధాబ్ధిచంద్రు
రామగోవిందశాస్త్రినిఁ బ్రస్తుతింతు. 8

ఉ. శ్రీధరు సత్యభామను విశేషదయారసపూరితాత్మునిన్
బోధకళాపరిపూర్ణు గుణభూషితసత్యవతీశుఁ గీర్తిపా
థోధిశయోజ్జ్వలున్ విగతదోషు గురుం బురుషోత్తమున్ జగ
న్నాధుని మామకస్మగుమనంబున నిల్పి నుతుల్ ఘటించెదన్.

ఉ. ఏయెడ నాకు వృత్తియొకఁడేర్పడకుండినఁ బాఠశాల కా
ప్యాయనవృత్తిఁ బిల్చి నను బండితుఁజేసి యుపాధి నెంతయున్
బాయక కూర్చినట్టి యనపాయశుభంకరు నెజ్జమిల్లినా
రాయణమూర్తిఁ గొల్తు నికరంపుఁగృతజ్ఞత నివ్వటిల్లఁగన్. 10

సీ. జనకుఁడై యొకవేళ ఘనదోషములు పటా
పంచ గావించి మన్నించు నెవఁడు
అనుజుఁడై యొకసారి యాత్మగతాభీష్ట
వికసనం బొనరించి వెలయు నెవఁడు
మంత్రియై యొకతూరి మంచిచెడ్డలనెల్ల
ధీవిశేషమున బోధించు నెవఁడు
మిత్రుఁడై యొకమారు మేలును బ్రికటించి
యేచాయ గోప్యంబు దాఁచు నెవఁడు

గీ. అతఁడు ధీమూర్తి నాకు హితైకవర్తి
లౌకికకళాపరిపూర్తి సల్లలితకీర్తి
సరసకవితారసజ్ఞతాచక్రవర్తి
భవ్యపథవర్తి కొప్పర్తిభానుమూర్తి. 11

సీ. కలుషాంధకారప్రకాండపరిఖండన
పండితమార్తాండమండలుండు

క్రోధాదిషడ్వర్గఘోరాటవీవాటి
కాభీలవీతిహోత్రాయితుండు
చంచత్తపోజపస్స్వాధ్యాయ నిరత స
న్మార్గైకసంచారతత్పరుండు
చండికాహ్వయమహాసవనమంత్రమణీస
ముద్రియమానధీముద్రితుండు
గీ. అమలశిష్టాన్వవాయదుగ్ధాబ్ధిచంద్రుఁ
డాంధ్రగీర్వాణవాణీసమంచితుండు
రాజమాన్యుండు సూర్యనారాయణుండు
మజ్జనకుఁ డామహాత్మునిం బ్రస్తుతింతు. 12

సీ. మగనినెత్తెక్కెడు వగలాఁడి కాకున్న
జాహ్నవీదేవి తా సాటివచ్చు
నలువురినోళ్ళలోఁబడి చరింపకయున్న
భాషావరారోహ ప్రతి దనర్చు
నింటింటఁదిరుగు వాల్గంటియే కాకున్న
క్షీరసాగరకన్య మారువచ్చు
మగనిశరీరంబు సగముసేయకయున్న
సర్వమంగళ కొంత సమతవచ్చు
గీ. జనులకొనవ్రేలఁ జూపించుకొనకయున్న
సతి యరుంధతి రవ్వంత సాటివచ్చు
ననఁగఁ గీర్తిఁ గన్న నరసమాంబ నాదు
మాతృదేవతఁ బూజింతు మహితభక్తి. 13

మ. సరసీజమ్మను తమ్మిపేరు ఘనభాషావార్ధి నేగ్రంథముల్
పరిశీలించిన మృగ్య మేరయినఁ జూపంగల్గినన్ దోన షూ

శిరముల్ బోడియొనర్చుకొందుమని వారిఁ డంబముల్ పల్కు ము
ష్కరులౌ కాకవిపాళినోళ్లు ముడువంగాఁ గోరెదన్ నెమ్మదిన్.14

ఇట్టు లిష్టదేవతాప్రార్థనంబును సుకవిసమాభినందనంబును గురుచరణారవిందవందనంబును గుకవినిందనంబును భక్తిపురస్సరంబుగా నాచరించి కేవలకల్పనంబును గేవలమిశ్రమంబును గాక కేవలసత్యంబును శృంగారరసప్రధానంబునగు హృదయాభిరామంబను ప్రబంధరాజంబునకుఁ గవితారసజ్ఞ సరసాగ్రేసరు మహోదారునిఁ గృతినాయకునిం జేసి తదారంభమునకు మంగళాచరణంబుగాఁ గృతీశ్వరుండగు శ్రీ రాజా వేంకటనారసింహాప్పరాయబహద్దర్ వారి వంశావతారం బభివర్ణించెద. 15

సీ. చతురాననభవాదిక్రతుభుక్కిరీటాగ్ర
హరినీలచంచరీకాంచితంబు
కమలా కరస్థకంకణమణీదీప్త్యోఘ
రమణీయకింజల్కరాజితంబు
నిర్జరకల్లోలినీస్వచ్ఛసురభిళ
మకరందలహరీ సమంచితంబు
సనకసనందనాది నిఖిలమునిమనో
హంసపరంపరా వ్యావృతంబు
గీ. కన దుపనిషద్వధూత్తంసకాయమాన
మగుచు బెడఁగారు హరిచరణారవింద
మందు నింపొందు శౌర్యధైర్యాదిగుణము
లకు నిధానమై పద్మనాయకకులంబు. 16

ఉ. అందుదయించి మూలపురుషాగ్రణి ధీరుఁడు యుద్ధసత్కళా
స్కందుఁడు దారితప్రథితశత్రుఁడు శ్రీగణపత్యభిఖ్యరా

జేందరివరూధినీసుభటబృందనిషేవితదండనాథుఁడై
యందె నఖండకీర్తి బసవాఖ్యుఁ డపారపరాక్రమాఢ్యుఁడై. 17

చ. బసవసుతుండు తిమ్మపతి బాపన తత్తనయుండు పెంపుసాం
పెసఁగఁ బ్రతాపరుద్రధరణీశ్వరు పక్షముఁ బూని యుద్ధముల్
పస నొనరించి రాంధ్రనరపాలునిరాజ్యము గూలిపోవఁగాఁ
గొసకల నూజివీట నొకకోటను బాపన గట్టె నేర్పుమై. 18

ఉ. వారికొమాళ్ళు కోనపనృపాలురు పాలన నూజివీట దు
ర్వారనిరంకుశత్వమున వర్ధిలఁజేసిరి తన్నృపాలురం
దాఱనికీర్తి యప్పనసమాఖ్యుఁడు దాలిచెఁ దాళికోటలో
ఘోరరణాంగణమ్మున నకుంఠితశౌర్యముఁ జూపి యుద్ధతిన్. 19

ఉ. ఆహవదోహలాఢ్యుఁడగు నప్పనృపాలునియుద్ధవిద్యకున్
వ్యూహవిభంజనక్రియల కూర్జితశక్తికి నిబ్రహీమ్‌కుతుబ్
షాహయుఁ జాందబీబి నిజశత్రుఁడు ఢిల్లిపురీశుఁడెల్లరున్
సాహససాహసాంకుఁడని సంస్తుతులం బొనరించి రాతనిన్. 20

శా. వీరాగ్రేసరు నప్పనాఖ్యప్రతిభన్ వేనోళ్ళ శ్లాఘించుచున్
బ్రారంభంబునఁ జాందబీబి "విజయ" ప్రఖ్యాతచిహ్నమ్మిడెన్
వైరిశ్రేష్ఠుఁడె యిబ్రహీ మొసఁగె "నప్పారాయఁ"డన్ సంజ్ఞ న
వ్వారిన్ దత్కులజుల్ తదాది గని "రప్పారాయ"నామమ్ములన్.

కం. ఘోరాజి "సోనపుత్ర"ను
వీరులు మొగలాయిపతులఁబీచమడఁచుచున్
వీరస్వర్గము విజయా
ప్పారాయ లలంకరించె వారి మనుమఁడున్. 22

కం. రెండవవిజయాప్పారా
యం డష్టాదశసుమండలాఢ్యుఁడు తత్పు

త్రుండైన వేంకటాద్రియు
వెండియు "రాజా" "బహాదరు" బిరుదము లందెన్. 23

గీ. అతనిసుతుఁడు రాజానృసింహాప్పరావు
"ఓ—జలాదతు—దస్తుగహా"—జగతిని
"తీన్ హజారు—మనసబుదార్" దివ్యబిరుదు
లందె నైజాముసుల్తాను లాదరింప. 24

ఉ. పుట్టినవారలందఱు నపూర్వపరాక్రమశౌర్యలక్ష్మిఁ జే
పట్టినవారె పట్టినృపాలురపక్షముఁబట్టి వైరికిన్
దొట్టినమంటలాయనఁగఁ దోఁచినవారలె దానమందు న
ప్పట్టణనేతలం దొకనృపాలుఁడు గర్ణునిఁ దోసిరాజనున్. 25

సీ. కట్టబట్టయులేక మట్టాడు సాధుసం
తతులకు జిల్గువస్త్రంబు లబ్బె
తిననోగిరములేక తిరుగాడు బైరాగి
సమితి కింపైనభోజనము లబ్బె
తలదాఁచుకొనలేక పలవించుసన్యాసి
మండలమ్మునకు మేల్మఠము లబ్బె
త్రాగఁ బాత్రయులేక తారాడుజోగుల
కింబడరఁగఁ గలశంబు లబ్బె
గీ. హతమనోరథులగు సకలార్థులకును
దనివితీరఁ బూర్ణమనోరథంబు లబ్బె
గరిమ ధర్మాప్పరాయవిఖ్యాత వేంక
టనరసింహాప్పరాయు పాలనమునందు. 26

ఉ. ఘోటకకుర్కురోష్ట్రమదకుంజరమండలికిన్ విహారపుం
దోట మహేంద్రభోగములదొంతరకున్ నెలవైనకోట బల్ -

వాటపుఁబొండిలిం బరఁగు భవ్యులపాలి వరాలమూట ను
త్పాటితశత్రుఘోట శనివారపుపేట నతండు రాజిలెన్. 27

చ. ♦ "వెలమకులంబునందు నిలు వెల్లరు కాంత లటన్న" పద్య మీ
తెలుఁగుఁబ్రపంచమొందనుకఁ దేజముఁ దాల్చునో యంతదాఁకనుం
దొలఁగునె? యిట్టిలక్షణకుఁ దోరపులక్ష్య మదెవ్వఁడయ్యె న
య్యలఘుచరిత్రు నెన్ననగునా? నృపు వేంకటనారసింహునిన్.

ఉ. పండితపక్షపాతి నుతిపాత్రచరిత్రుఁడు శాంతమూర్తి కో
దండకశైకశౌండుఁ డతిదాంతుఁడు పాండురసద్యశఃప్రభా
ఖండుఁడు చండశత్రుజనకాండవిఖండనదక్షుఁడు బ్ర
హ్మాండతలైకదాతయని ఖ్యాతి గడించె నతండు దండిగన్. 29

ఉ. సీతునఁ గూయునక్కలకుఁ జెల్వగుదుప్పటు లంపె జంతుకం
తూతికి రాతికంబముల నూల్కొనఁజేసె సమస్తయాచక
వ్రాతపుటీప్సితార్థము లపారముగాఁ గురిపించె నింతగా
భూతదయార్ద్రబుద్ధిగలభూపతి పుట్టెనె పుట్టఁబోవునే? 30

సీ. అగ్రజన్ముల కనేకాగ్రహారము లిచ్చెఁ
దవ్వించె బహుసరఃప్రకరములను
ఆరామసందోహ మందందు నిర్మించెఁ
బోషించెఁ గృతులంది బుధతతులను
దేవాలయమ్ముల లావొప్పఁ గట్టించెఁ
బాతించె నిక్షేపపటలములను

---

♦ చ. వెలమకులంబునందు నిలు వెల్లరు కాంత లనంగ విందు న
ప్పలుకు లబద్ధమాయె; కులపాలక! ధీనిధి! యప్పరాయ! రా
ట్కులకులకీర్తికాంత కృతికాంతయు శ్రీజయకాంత మువ్వురున్
గలజగమంతయుం దిరుగఁగాఁ గనుగొంటిని చిత్రమిద్ధరన్.

పేదవారలకెల్లఁ బెండ్లిండ్లు సేయించె
వెలయించెఁ బృథుమార్గవిసరములను
గీ. వంశకరుఁడైనపుత్రకుఁ బడయఁగల్గె
సప్తసంతాననిర్మాణచతురుఁడైన
వేంకటనరసింహాప్పరాడ్వీరునందు
లేనిగుణ మున్నదోషమ్ముఁ గాననగునె? 31

ఉ. ఆమహనీయువంశమున నంచితశీలుఁడు పొల్చె భోగసు
త్రాముఁడు పార్థసారథిధరాతలనాథుఁడు దానశౌండుఁ డు
ద్దామపరాక్రముండు గుణధాముఁడు ధీవిభవుండు వెల్మవం
శామృతభానుఁ డాశ్రితజనామరభూజుఁడు వంశకర్తయై. 32

సీ. స్వర్ణసింహాసనపార్శ్వభాగములందుఁ
గంబుకంఠులు చామరంబు లిడఁగ
నిరుకెలంకులయందు ధృతఖడ్గపాణులై
భటకదంబము బరాబరు లొనర్ప
సకలపురాణార్థసంపన్నులైన వి
చక్షణుల్ స్వస్తివాచకము వలుక
నైజాముదత్తరత్నఖచితహారాళి
ధగధగత్కాంతులు తాండవింప
గీ. "పంజ్ హజార్ సర్ ఫరాజ్వంతు పాలవంచ
అండుభద్రాచలము సవా యశ్వరావు
రాజమహబూబ్ వబాద్షాహి" ప్రముఖమైన
బిరుదముల వందిమాగధుల్ పేర్మిఁ బొగడ. 33

ఉ. వాణికిఁ గాణయాచి శనివారపుపేటసురాజ్యలక్ష్మి దో:
స్థానములన్ ధరించి తటితో నధికారములందుచున్ జగ

త్త్రాణుఁడు పార్థుఁ డేలె బళిరాయన 'నౌబతుఖాన' భూరిని
స్సాణధణంధణధ్వనుల సందడి సంజల దందడింపఁగన్. 34

ఉ. అప్రతిమప్రతాపుఁ డసహాయసహాయుఁడు తాత్రియమాణవి
ప్రప్రకరుం డకుంఠితపరాక్రమధిక్కృతఫల్గుణుండు కా
వ్యప్రియుఁ డార్యసన్నుతుఁడు వైష్ణవభక్తిరతుండు లాస్యవి
ద్యాప్రతిపాలకుండు సరసాగ్రణి కీర్తిశరీరుఁడిమ్మహిన్. 35

ఉ. ఆతరుణీమనోహరుఁ డహర్పతితేజుఁడు చెట్టఁబట్టెఁ బ్రి
స్ఫీతఁ బవిత్రవర్తనవశీకృతభర్తృమనోంబుజాత సం
పూతకులాభిజాత బహుపుణ్యపరీత క్షమాదిసద్గుణా
వ్రాత వినీత సీత కెనవచ్చు సతీత్వసమేత సీతమన్. 36

గీ. సీతమాపార్థసారథిస్థిరగుణులకు
ననఘగుణుఁడైన శ్రీనారయప్పరావు
ప్రథితవేంకటరామప్పరాయఁ డనఁగఁ
గొమరు లిరువురు వొడమిరి కొమరుమిగుల. 37

ఉ. ఆగుణగణ్యయుగ్మకమునం దల జ్యేష్ఠుఁడు నారయప్పరా
వాగమధర్మకర్మరతుఁ డాంగ్లకళాభ్యసనుండు పాలితా
భ్యాగతసంశ్రితార్థికవిపండితగాయకమండలుండు పూ
ర్వగతమైనయట్టి ఓరుగ[illegible]ఁ దాలిచి [illegible]తె లీలన్. 38

ఉ. నారయపార్థివుండు నరనాథకులాబ్ధిసుధాంశుఁ డంచితా
కారవిలాసభాసురుఁ డఖండపరాక్రమశోభితుండు వి
స్ఫారవివేకశాలి గుణసాగరుఁ డచ్ఛయశఃప్రపూర్ణది
గ్వార[illegible] సుదారుఁ డాహతవిపక్షుఁ[illegible] కే[illegible]లరాజమాత్యుఁడే. 39

గీ. జనకనిర్మితకార్యసంచయము లెల్ల
• వంపుటొంపును లేక తీర్పఁగల బుధుఁడు

భద్రవారణవాహనోద్భాసురుండు
సంస్కృతాంధ్రాంగ్లవిద్యా విశారదుండు. 40

ఉ. ఆతఁడు పెండ్లియాడె సుగుణార్ణవ నర్ణవమేఖలాన్వితో
ర్వీతలపూర్ణకీర్తియుత విశ్రుతశీల సమస్తసద్గుణ
వ్రాతఁ బతిశాంత భర్తృవశవర్తిని భూరిపవిత్రవంశసం
జాతను నన్నపూర్ణయనుసాధ్విని నున్నతవైభవంబునన్. 41

శా. "అమ్మా! అన్న" మటన్న మాట వినుచో నాకంఠముల్ స్వాదుభో
జ్యమ్ముల్ గూరిచి యాదరం బెసఁగ సర్వాన్నార్థు లుబ్బంగ సా
ర్థ మ్మారీతి నిజాఖ్యఁ జేసికొను సద్ధన్యాత్మురా లన్నపూ
ర్ణమ్మారావున కుద్ది యెందుఁ గలరే నారీప్రపంచంబునన్. 42

కం. గానములపోత్రివై యొప్పెడు
ననుపమసతి రాజ్యలక్ష్మి కగ్రజులగుచున్
జనియించిరి వారికి ధీ
ఘనులు ముగురుపుత్రులు బహుకలుషవిదూరుల్. 43

గీ. అందు జ్యేష్ఠుఁడై తగు విజయాప్పరావు
పరఁగును ద్వితీయుఁడై పరితాపాప్పరావు
పరిభవమందెను గడగొట్టుపట్టి వేంక
టనరసింహాప్పరావు సజ్జనహితుండు. 44

ఉ. ఆకడగొట్టుపుత్రకుఁడె యగ్నిలి మత్కృతిభర్త గానవి
ద్యాకలితాంతరంగుఁడు వదాన్యుఁడు ధర్మపథానుయాయి సు
శ్లోకుఁ డుదాత్తమానసుఁడు సూరిజనావనకృత్యబద్ధధీ
లోకుశలుండు సూనృతవచస్కుఁడునై పెనుపొందు నున్నతిన్ 45

చ. పటుతరశౌర్యశాలి గుణభద్రుఁడు పాములపాడునేత వేం
కటమహినాథుఁ డాతసికిఁ గల్గిన కూరిమిముద్దుబిడ్డ వేం

కటరమణయ్యమాంబ ముఖకాంతివినిర్జితచంద్రబింబఁ బ్రా
కటసుగుణావలంబఁ గుతుకమ్మునఁ బెండిలియాడె నాతఁడున్ 46

కం. అతులితకరుణారససం
స్తుతమతి గుణవతి విమలయశోవతి విలస
ద్ధృతి రూపవతి వినయవతి
చతురమతి సతులెవరు ప్రతి క్షమఁ దత్సతికిన్. 47

సీ. పరమపాతివ్రత్యవైభవంబున జగ
న్నుతినిఁ బొందిన యరుంధతికి సాటి
ప్రథితక్షమాసంపదను సర్వము నోర్వఁ
జాలు సర్వంసహాసతికిఁ బాటి
సజ్జనస్తుతికి భాజనమౌ కళాకలా
పప్రవీణత సరస్వతికి సాటి
కమనీయరూపరేఖావిలాసశ్రీనిఁ
బ్రసవాస్త్రరాణియౌ రతికిఁ బాటి
గీ. ప్రవిమలోన్నతసద్గుణరత్నపేటి
వినుతసౌశీల్యసౌజన్యపికవితతికి
నాశ్రియంబయియొప్పు నుద్యానవాటి
భవ్యవేంకటరమణమాంబావధూటి. 48

కం. అమలాత్మకులగువారికిఁ
గమలాదేవియనఁగ నొకకన్యామణి ధీ
రమణీయ జనించె రమా
రమణీమణి గలశవార్ధిఁ బ్రభవించినటుల్. 49

గీ. మా కృతిసతి మెట్టిన వేళ మంచిదగుచు
వేంకటరమణయ్యమ్మరాడ్వేంకటనర

సింహభూపదంపతులకు శ్రీ లొసంగి
పుత్రపౌత్రాభివృద్ధిగాఁ బ్రోచుఁగాత! 50

ఉ. ఇందుఁడు వైభవంబున ఫణీంద్రుఁడు వాగ్విభవంబునందు శై
లేందుఁడు ధైర్యసంపద నుపేంద్రుఁడు రక్షణమందు శ్రీహరి
శ్చందుఁడు సత్యసూక్తి గుణసాంద్రుఁడు వేంకటనారసింహరా
జేంద్రుఁడు భూతలమ్మున సహిప్రతిష్ఠమై విలసిల్లుఁ బేరిమిన్. 51

ఉ. అన్నవచస్సుఁ ద్రోయఁడెపు డవ్వల లక్ష్మణుభక్తి వైఖరిన్
దిన్నగఁ దీర్చిదిద్దఁగల ధీసముదారుఁ డుదీర్యమాణభా
వోన్నతుఁ డాశ్రితావనుఁ డనూనగుణుండు నృసింహనేత త
త్సన్నుతవర్తనం బొగడఁజాలుదురే మహినెంతవారలున్. 52

ఉ. మాటను నిల్పఁగాదె బలి మర్మ మెఱింగియు దానమిచ్చె మున్
మాటను నిల్పఁగాదె గుణమాన్యుఁడు కర్ణుఁడు ప్రాణమిచ్చె మా
ర్మాటల కాయితంపడని మానవులే చిరకీర్తివంతు ల
మ్మేటుల గీటుపుచ్చెడు నమేయవచస్కుఁడు మత్కృతీశుఁడున్.

సీ. తన నామధేయంబు వినునెల్లవారల
వీనుల కమృతంపువాన గురియఁ
దన యువలంబంబు ధరణీసురలకెల్లఁ
గల్పద్రుమంబును గడచి చనఁగఁ
దన మహిష్ఠగుణలతానికురుంబంబు
దిక్తటంబులనెల్లఁ దెరలిపాఁకఁ
దన దానమహిమంబు తరణినందన మేఘ
బలిసార్వభౌములఁ బరిహసింప
గీ. నతఁడు వెలుగొందుఁ బద్మనాయకకులాబ్ధి
పూర్ణిమాయామినీకాలపూర్ణవిధుఁడు

దశదిశాచక్రసంవ్యాప్తయశుఁడు ఘనుఁడు
వేంకటనరసింహాప్పరాడ్విబుధవరుఁడు. 54

శా. రాజార్హంబగుశ్రీవిగల్గియును గర్వం బింతయున్ లేనివాఁ
డోజస్సంయుతుఁ డిద్ధతేజుఁడు మహాయోధుండునున్ సద్గుణా
భ్రాజిష్ణుండు గభీరమానసుఁడు విద్వద్రాజసంస్తుత్యుఁ డీ
రాజా వేంకటనారసింహు దొరయన్ రా రెవ్వ రుర్వీస్థలిన్. 55

ఉ. తోషితకౌరవప్రభుఁడు ద్రోణుఁడు ధర్మజుఁ బట్టి శత్రుసి
శ్లైషతఁ గూర్చఁదాఁ బ్రతినసేయుఁడుఁ ద్రాసముమ్మై నసత్యసం
భాషణ మాత్మరక్షణకుఁ బల్కినధర్మజుఁ డిద్ధసత్యసం
భాషణభూషణుఁడయిన మాకృతిభర్తను బోలనేర్చునే. 56

గీ. ఆడితప్పనివాఁడు శౌర్యంబువాఁడు
నోర్మి గాంభీర్యగుణముల నొప్పువాఁడు
వినయసంచ్ఛాదితోద్ధతి వెలయువాఁడు
స్వాత్మసంస్తుతిలేనివాఁ డప్పరావు. 57

ఉ. భూసురభక్తికిన్ సదనభూమి మృదూక్తికి తావు కీర్తి కా
వాసము నీతివిద్యకు నివాసము పూతచరిత్ర కూఁత వి
శ్వాసపుఁబట్టుకొమ్మ గుణసంతతికిన్ నిలయమ్ము సజ్జనా
గ్రేసరుఁ డప్పరాట్ప్రభువు కేవలమానవమాత్రుఁడే భువిన్. 58

శా. దిగ్దాహంబు ఘటిల్లినన్ ఘనపయోధిశ్రేణి ఘూర్ణిల్లినన్
బ్రాగ్దేశంబున మాని పశ్చిమమునన్ భానుండు జన్మించినన్
దిగ్దంతుల్ తడబాటునొందినను ధాత్రీచక్ర మల్లాడినన్
వాగ్దానంబున కొండుపల్కఁగవ దప్పారాయ జిహ్వాస్థలిన్. 59

సీ. ధ్రువుఁడై తనర్చె బసవదండనాథుఁడు
పంచతంత్రాఖ్యప్రబంధమునకు

అధిపుఁడయ్యె నరసింహాప్పరా వెందుఁను
తీపరిణయనాను దివ్యకృతికి
నాథుఁడయ్యెను జగన్నాథుఁడు సాహిత్య
కల్పద్రుమాభిధగ్రంథమునకు
స్వామియయ్యెను రామచంద్రభూపుఁడు వల్ల
వీపల్లవోల్లాస విమలకృతికి
గీ. నేటికి మరలఁ దాతలనాటికీర్తి
నిలిపి కవులఁ బోషించి కీర్తిలత దిశలఁ
బ్రాఁకఁ బ్రభుఁడయ్యె హృదయాభిరామకృతికి
త్యాగములతావు మానృసింహాప్పరావు. 60

## షష్ఠ్యంతములు.

కం. ఏతాదృశగుణవంతున
కాతతసత్కీర్తిధవళితాశాంతునకున్
పూతస్వాంతునకును ధా
త్రీతలకాంతున కదభ్రధీమంతునకున్. 61

కం. జిష్ణున కఖిలసుగుణవ
ర్ధిష్ణునకు దురితనిరాకరిష్ణునకు మహా
ధృష్ణునకు దానగుణరో
చిష్ణున కతులితకృపావిజితవిష్ణునకున్. 62

కం. ఆహవతలతుణయుక్తున
కూహాపోహావిచక్షణోర్జితమతికిన్
ఈహామాత్రపరిష్కృత
సాహససంసక్తకార్యసందోహునకున్. 63

కం. పండితవిధేయమతి కా
ఖండలవిభవోన్నతికి నఖండసుకవిరా
ణ్మండలవర్ణితధృతి కు
ద్దండవితరణగుణరతికి ధర్మవ్రతికిన్. 64

కం. నవరసరసిక శిఖామణి
కవిరళధిషణాంచితునకు నతిశాంతునకున్
బ్రవిమలచిత్తాంభోజున
కవతంసితనిఖిలకవిజనాసీకునకున్. 66

కం. కరుణాపరిణతహృదయున
కరుణాధికసత్ప్రతాపహంపీరునకున్
శరణార్థిభయతమశ్ఛయ
గిరణచణారుణున కమరగిరిధీరునకున్. 66

కం. జనసన్నుతున కిదానీం
తనదానసరోజమిత్రతనయునకు మహా
ఘనున కలంకర్మిణున
కనుపమతేజునకు సద్గుణాస్థానునకున్. 67

కం. ధిక్కృతవైరికి సత్య
న్యక్కృతశమనాత్మజునకు నవకుందసుమ
స్రిక్కాండసదృశయశునకు
వాక్కంజాతోద్భవునకు వరిష్ఠునకున్. 68

కం. వేంకటనరసింహనృపా
లాంకునకును రమణయాంబికాజ్జాక్షీమీా
నాంకునకు విపశ్చిత్కవి
పంకజసందోహతరుణభాస్వంతునకున్. 69

అభ్యుదయ పరంపరాభివృద్ధియు నఖండైశ్వర్యాభివృద్ధియు వంశాభివృద్ధియునగునట్లుగా నాయొనర్పంబూనిన హృదయాభిరామం బను ప్రబంధరాజంబునకుం గథావిధానం బెట్టిదనిన 70

## కథాప్రారంభము.

ఉ. పూతచరిత్రయుక్తమునిపుంగవపూజితచారుగౌతమీ
ఖ్యాతవిశాలశాఖల నఖండపవిత్రితఁ గాంచి నిర్ఝర
వ్రాతసదాభిపోషితయవక్షితిమండలరమ్యయౌ వసి
ష్ఠాతటినీతటోర్వి విరజాపుర మొప్పు సమంచితోన్నతిన్. 71

సీ. దాక్షిణాత్యానల్పదక్షశిల్పాంచిత
శ్రీకేశవాలయక్షితితలంబు
బహుపురాణసమయపాశ్చాత్యజనకృత
సురుచిరవాణిజ్యశోభితంబు
ప్రాంచదష్టాశీతివర్షపూర్వస్థాపి
తాంగ్లేయపాఠశాలాంచితంబు
ఖండాంతరవ్యాప్త ఘనకీర్తిసంయుత
రంజకవ్యాపారరాజితంబు
గీ. సాహసౌదార్యశౌర్యవిస్తారధుర్య
దాననారాయణాదివిఖ్యాతవినోద
సక్తమానసన్పృహామేధిసంయుతంబు
శ్రీనిధానంబు విరజాపురీవరంబు. 72

గీ. శర్వరీతతి దీపికాసంచయంబు
నగరలక్ష్మికి నీరాజనం బొసంగుఁ
బ్రాగ్దిశాభాగమందు వైతరణి మేటి
వీచికాచామరంబుల వీచు నెపుడు. 73

చ. సుభగవచోవిలాసయయి శోభిలువాణినిఁ జెట్టఁబట్టి తా
నభిరతి నాల్గువేదముల నన్నియమోములఁ దాల్చి నంబురు
ట్ప్రభవునిఁ దోసిరాజనుచుఁ బ్రాణిగణంబున కెప్పుడున్ శుభా
శుభములఁ దెల్పు భూసురులు శోభిలుచుందురు తత్పురంబునన్ 74

ఉ. కొందఱు వేదపారగులు గొందఱు శాస్త్రవిచారదక్షు ల
స్పందితసంస్కృతాంధ్రరససాగరపారగు లింకఁ గొందఱున్
గొందఱు ధీసముద్రులును గొందఱు జాణలుపూర్ణవిద్యలం
దందరు వారివృత్తముల నందఱు నందుకొనంగఁ బోయినన్. 75

కం. భూరితుషారానిలమున
నీరంబులపగిది నింకు సిధి బుద్ధి యశో
భారము లా పురివేశ్యల
చీరచెఱఁగుఁజిఱుతగాలి చెనకినయంతన్. 76

చ. కలఁడొకదొడ్డభూసురుఁడు గాఢయశఃపరిభూషితుండు ని
ర్మలహృదయాంతరంగుఁ డసమానకవిత్వపటుత్వతత్త్వసం
కలితవిశేషధీయుతుఁ డకారణసజ్జనబాంధవాయితుం
డలఘుగుణప్రకాండుఁడు ద్విజావళికెల్లను మేలుబంతియై. 77

చ. పలికిన భావమొల్కు మితభాషి యజస్రము సూనృతంబెసు
మ్మలయనృతంబు పైఁడి తనయంతటియెత్తునఁ బోయఁగాంచినన్
బలుకఁడు తప్పుసాక్ష్యములఁ బల్కఁడు నెత్తినిఁ గత్తి నెత్తినన్
బలుకఁడు ప్రల్లదంబు మఱి వాలఁడు హింసకు నెట్టిపట్టునన్ 78

చ. తనపనియేమొకాని పెడదారినిఁ ద్రొక్కియెఱుంగఁ డొక్కఁడున్
జనఁడు విహారమార్గములఁ జక్కనిచుక్కలయందుఁ జక్కనౌ
వనితలవైపు దృష్టి నొకపట్టున నేఁ బరఁగింపఁ బోఁడు గా
యనుఁడు శివార్చనాపరుఁడు నంచితధర్మచరిత్రుఁ డెంతయున్ 79

ఉ. తూలఁడుమాట యెన్నఁడును దుందుడు కెందును జెందఁబోఁడు స
చ్ఛీలుఁ డుదారచిత్తుఁడు విశిష్టదయారసపూరితాత్ముఁ "డే
జోలికిఁబోఁడికిం"జనఁడు సూనృతవాగ్విభవాభిరాముఁడై
క్రాలును రామనామమున గాథయశోవిభవాభిరాముఁడై. 80

చ. సతి కనుకూలుఁడై హితవిచారముసేయుచు మంచిచెడ్డలన్
బతి చరియించుఁ "జిల్కగోరువంకలయట్టులెసంగు వీరి దం
పతుయదృష్ట మిట్టులు విభాసిలఁగావలదే" యటంచు సం
తతము జనుల్ నుతింప నయతత్పరుఁడై యతఁడొప్పు నప్పురిన్.

గీ. తనను లోకులు మెచ్చువర్తనము గలిగి
కీర్తిఁ గాంచినతండ్రి సత్కీర్తి నిలిపి
చటులభీకరసంసారసాగరంబు
నీఁదు గార్హస్థ్యధర్మసంవేది యగుచు. 82

గీ. ఇంచుమించుగ నించుక మించు తైత
నల్లువాఁడైనయింటికి నల్లువాఁడు
వెలుపునిడుపునురమ్యమై వెలయు మంచి
యింటివాఁడును నౌనన్నయింటివాఁడు. 83

ఉ. ఆతనియింటిలోన ననయంబును గాపుర మగ్రివంశసం
జాతుఁడు స్థూలకాయుఁడు నజాతరిపుప్రకరుండు హాస్యవి
ద్యాతతచాతురీభరసమంచితుఁ డెంతయు స్నేహపాత్రుఁడున్
నీతిపథప్రవర్తనుఁడు నిర్మలచిత్తుఁడు మేటిరొజ్జయున్. 84

ఉ. కంటిని రెప్ప యెప్పుడును గాచువిధంబున వానితల్లి యి
ల్లంటుచు నింటిపెత్తనము లొనరఁజేయుచునుండు నాతఁడో
కొంటెలలోనఁ గొంటెయును గోవిదులందునఁ గోవిదుండునై
యుంటఁడు ముట్టఁ జేపనియు నాతనిభాగ్య మదెట్టిదోకదా! 85

కం. బొజ్జయ యారాముసితో
సజ్జనసాంగత్యమూని చరించు సదా
విజ్ఞోడువడక చూపఱు
లజ్జారే మైత్రియనిన నట్టిద యనఁగన్. 86

ఉ. మజ్జనభోజనాదు లొకమాఱు విహారము లొక్కమాఱునన్
సెజ్జకుఁ జేరు టొక్కతఱిఁ జిత్రవిచిత్రము లాడుకొంచు సే
పజ్జకుఁబోయినన్ గలిసి వర్తిలుచుందురు రెల్లవేళలన్
బొజ్జయరాములిర్వురును బూవును దావివలె న్నెలంగుచున్. 87

ఆ.వె. రాము నింటిముందు రమణీయమై యొప్పి
పెల్లు చల్లనీటి వెల్లువలను
అల్లిబిల్లి మెల్ల నల్లుకొనుచు నుల్ల
ముల్లసిల్లఁజేయు నొక్కవల్లి. 88

వ. తన్మనోజ్ఞవల్లీనికటాసనాసీనుండై రాముండు గ్రంథావలోకనా
యత్తచిత్తుండైయుండ నొక్కనాఁడు 89

సీ. కొంగఱెక్కలఁగేరు కొంగ్రొత్తమడతల
మిసమిసల్ దెసలందు మసలుచుండఁ
జీలమండలఁదాఁకి జీరాడి వ్రేలాడు
నొరగొచియొయ్యార ముట్టిపడఁగఁ
దెలుపుసేసిన యావిదేశితొమ్మిదివేల
మల్లు "లాలిచి" వ్రేలి మలయుచుండ
మద్రాసుమడతల మలయు "రుద్రాక్షుంచు"
కండువాకాంతులు గంతులిడఁగ
గీ. మోమునం దూర్ధ్వపుండ్రముల్ ముద్దుగులుకఁ
బంచచివరంచు ఛేతితోఁ బట్టుకొనుచు

బొట్టులో వైష్ణవతయెల్ల నుట్టిపడఁగఁ
గట్టెదుట నొక్కనరుఁడు సాక్షాత్కరించె. 90

వ. రాముఁడు వైష్ణవావతంసున కుచితసత్కారంబు లొనర్చు సమయంబున లోనుండి బొజ్జయ్య యట కరుదెంచి పూర్వపరిచయప్రచయోద్ఘాటనంబు సేయు వైష్ణవాగ్రణునివృత్తాంతంబు సర్వంబు నివేదించె. అంతఁ గొంతవడికి వారిరువు రేమేమియో ప్రసంగించుకొనుచు నావలకుం బోయిరి. అంత బొజ్జనాడించుకొనుచు నాబొజ్జయ్య మరలివచ్చి సచ్చరిత్రుండగు రామునితో వైష్ణవుని వృత్తాంతంబు నిగూఢంబుగా నిట్లనియె. 91

సీ. గగనస్రవంతిలోఁ గాంచనశతపత్ర
మకరందమును గ్రోలుమధుకరంబు
విమలాప్సరోంగనా కమనీయ కబరికా
ప్రసవప్రతతి వ్రాలు బంభరంబు
నందనోద్యానసంతానప్రసూనసం
చయసౌరభం బానుషట్పదంబు
మానసకాసారమహితాబ్జమధుపాన
తుందిలం బైనయిందిందిరంబు
గీ. మలయుకనువేఁదుఱునఁ జేసి కలఁగి నేఁడు
ఔర! సేబానటంచుఁ దా నట్టెచొచ్చి
తవులువడియుండె నడియూస తన్నుఁ దఱుమఁ
బసికిమాలినయుమ్మెత్త ప్రసవమందు. 92

వ. అప్పలుకు లాలకించి దాని యథార్థ మానిశి మదినూహించి విశదంబుగ భృంగము వైష్ణవుండనియు నుమ్మెత్త యొకనీచ వేశ్యాంగనయనియు నాతఁ డామెకుం జిక్కెననియు రాముండు గ్రహించెనుగాని 93

కం. మఱుచటిదినమునసుండియు
మఱచుటయేకాని యట్టిమాటలు మదిలోఁ
జొఱనీయఁడు గాలము స
త్పురుషులు సద్గోష్ఠియందె పుత్తురుగాదే. 94

కం. అపుడపుడు వైష్ణవుఁడు చు
ట్టపుఁజూపుగవచ్చి యచ్చటను బొజ్జయతే
నపు డారామునితోఁ దో
రపుఁబలుకులు వలికి చెలిమి రాజిలఁజేసెన్. 95

వ. తొల్లింటియట్ల రాముండు వల్లినికటంబున బొజ్జయ్యతోఁగూర్చుం
డియుండ నొక్కనాఁడు వైష్ణవశ్రేష్ఠుండు వచ్చి 96

కం. ఇచ్చెదరో పొమ్మని వెసఁ
బుచ్చెదరో యెందుకష్టపుందశ యెదవన్
వచ్చితి మీదర్శనమున
కిచ్చమెయిం గోర్కె లోన నీరికలెత్తన్. 97

గీ. కష్టమొదవెడునప్పుడేకాదె మిత్రు
లడ్డుపడుదురు మీవంటిదొడ్డవార
లనెను వైష్ణవుఁ డదిరాముఁ డాలకించి
చేతిలోనున్నపనియైనఁ జేతుననియె. 98

ఉ. కొంటెవిరోధియొక్కరుఁడు 'కోర్టున' నాపయి 'డిక్రి' పొంది 'వా
రంటును' బెట్టినాఁడు ననుఁబ్రాజ్ఞులలో నవమానపెట్టఁ దా
వెంటనె 'కోర్టుబంట్రవుతు' వీథిమొగన్ నిలఁబెట్టినాఁడు నీ
వంటిదుదక్క వేఱొకఁడెవండును నిట్టి విపత్పయోనిధిన్. 99

కం. దాఁటింపఁ డిపుడు నే నీ
ప్పాటునఁ బట్టువడి 'సర్దుబాటు'ను జేయం

బాటవముసెడిలె మూఁడవ
నాటికిఁ దప్పక భవద్ధనం బిడువాఁడన్. 100

చ. పనివడి గంపెఁడాస తమపై నిడుకొంచును వచ్చినాఁడ ని
ష్పని యొనఁగూర్చి పంపుడు కృపారస మొప్పఁగ నంచు వేఁడ నె
మ్మనమునఁ దొట్రుపాటు ననుమానము నొందెడురాము నత్తఱిన్
గనుఁగొని బొజ్జయాహ్వయుఁడు గాటపుఁబ్రేముడి నివ్వటిల్లఁగన్

కం. కనుసన్న సేసి రాముని
ధనమున్న నొసఁగుమని యువతలకుఁ బిలిచి తా
ననినటు లతఁ డొనరుచుఁ గా
దన నాదే పూఁచియంచు నచ్చుగఁ బలికెన్. 102

కం. నీదేసుమి బాధ్యతయును
రాదేమొ డబ్బు తిరిగి రారాపు లవే
లా దనుకఁగ నన రాముం
డేదబ్బర లేదు ధనము నెంతయొసఁగినన్. 103

కం. తేతెమ్మని బొజ్జయ యన
నాతం డిరుశతము దెచ్చి యర్పణసేయన్
జేతంగొని యూరూకలఁ
జేతోమోదంబునొందె శ్రీవైష్ణవుఁడున్. 104

ఉ. అంతట వైష్ణవప్రవరుఁ డాధనముం గొనిపోయి "కోర్టులోఁ"
బంతమెలర్పఁ గట్టి యిటపై నెవ రేమియొనర్తురంచు ని
శ్చింతతఁ గూరుచుండె వెలచేడియయింటను గ్రొత్తయప్పుమా
టింతయు స్వాంతమందుఁ జొరనీయక పేరిమిఁ బూలరంగఁడై. 105

ఉ. మూఁడుదినంబులాయె మఱి మూఁడుదినంబులుగూడఁబోయె నే
జాడయు లేకపోయె నొకసా యు రాముని జూడఁడాయె నా

మూఁడుదినంబులుగ్ దుదకు మూఁడునెలల్ సరియాయె నల్లపూ
బోఁడియె స్వర్గమాయె నిట బొజ్జయరాములు దల్లడిల్లఁగన్. 106

ఆ.వె. అప్పుపుట్టుదాఁక నప్పిచ్చువారల
చుట్టుఁ దిరిగి తుదకుఁ జూపనోప
రాననంబునైన నడుగఁబోయిన బాకి
చాటువేసిమొగము దాఁటుచుండ్రు. 107

శా. 'ఏరా! బొజ్జయ! వైష్ణవోత్తముని జాడే లేదు నీవప్డు 'నా
దేరా' పూచి యటంచుఁ బల్కితివి నాఁడే నేను యోచించి యే
రారాపుల్ ఘటియిల్ల నీకుమనుచున్ బ్రశ్నింపఁగా లేదె యి
ప్డారా యేగతి డబ్బువచ్చుఁ జెపుమా యాలోచనం బియ్యెడన్.

కం. అని యపుడప్పుడు రాముం
డనుటయు నది మొదలు శ్రద్ధయందుఁదగిలి వాఁ
డనిశంబును వైష్ణవు జా
డ నెఱిఁగి కని యతని కనియె డగ్గుత్తికతోన్ 109

చ. "పరపతి"ఁ జంపుకొంటివి విపత్తున నడ్డమువచ్చి పూఁటగా
నిఱికినయట్టినాకును నిదే కొని తెచ్చితి పోటుమాట యి
క్కరణి నొనర్తువంచు నెఱుఁగంగదరా కలనైన మిత్రమా
మఱి మరియాద నిల్పుకొనుమా! మనుమా! మనమైత్రి నెంచుమా!

గీ. ఇచ్చెనాతండు మఱి నీవు పుచ్చుకొంటి
మధ్యవర్తినై చెప్పినమాటకొఱకు
నిఱుకటమ్మునఁబడి బిట్టు నిట్లు వేఁగు
'నాకు వచ్చెనుగద మధ్య నక్కచావు' 111

వ. అని తాలిమిదూలి శ్రుతికటువుగాఁ బలుకు పలుకు లాలకించి
•వానితో వైష్ణవుండు 112

కం. జాగయ్యెను క్షమియింపుము
రాఁగదె రేపకడ నీవు రామునితో వే
వేగమ ధనమిచ్చెద ను
మ్మ్రాగకుమిడుమిపుడు బొజ్జయేశ్వర యనినన్. 113

చ. 'సరిసరి' రాము నెత్తు వసుసంచయముల్ కొలపోసిపోసినన్
బరులగృహాన కేఁగఁడన వారవిలాసినియింటఁ జొచ్చునే
తరము గ్రహించి పల్కుము వృథా వెయిమాట లిఁకేలయింక 'రా
మురి'యడి కాలుపెట్టుటకుఁబోలు గృహమ్మికొ రాముబోంట్లకున్

కం. అని యాతని నడుగుటయును
ననుదినమును బొజ్జయ యట కపుడప్పుడు తాఁ
జనుటయు వైష్ణవతిలకుఁడు
ధన మీకుంటయు నిటువలెఁ దద్దయుఁ గడచెన్. 115

గీ. ధనముగలవానికైన నిర్ధనునకైన
నాణెమును ముట్టకుండు సన్యాసికైన
ప్రభువునకునైన హీనసేవకునకైనఁ
దవులకుండదు డబ్బుతో నవసరంబు. 116

చ. మనమున సర్థసంగతులమంచియుఁ జెడ్డ దలంచుచుండ రా
మునిమునుముందువచ్చి తనమోమును గుంచి విషణ్ణచిత్తుఁడై
మన మతఁ డున్నతావునకు మాపటివేళకుఁ బోవకుండినన్
ధన మిఁక రాదురా! యిది యథార్థమురా! యనెబొజ్జయాఖ్యుఁడున్

వ. అది విని రాముండు 118

గీ. ధనము పోయినఁ బోనిమ్ము దాసికంటె
ఘనతరంబైనమైత్రియుఁ జనఁగనిమ్ము

## గద్య.

ఇది శ్రీశిష్టావంశపయఃపారావారరాకాకైరవమిత్ర శ్రీ సూర్యనారా
యణశాస్త్రిపుత్ర బుధజనవిధేయ వేంకటసుబ్బయ
నామధేయ ప్రణీతంబైన హృదయాభిరామ
మను మహాప్రబంధమునందుఁ
ప్రథమాశ్వాసము



శ్రీరస్తు.




# ద్వితీయాశ్వాసము.




రాజత్ప్రసాద వి
హారా! మేరునగధీర! యాదఃపతిగం
భీరా! కరుణాపారా
వారా! వేంకటనృసింహభవ్యవిచారా! 1

అవధరింపు మనంతరంబు. 2

చ. కమలహితుండు ఘుస్రఘనకార్యములన్ గడముట్టఁదీర్చుచున్
బ్రమదముతోడఁదన్గవయవచ్చుచునుండెనటంచు నెంచి ప
శ్చిమహరిదంబుజాక్షి గడుఁజెన్నగురాగరసంబుఁబూనెనాఁ
గరిమముగ సాంధ్యరాగములు రాజిలెఁ గోకనదచ్ఛవిచ్ఛటన్. 3

సీ. గరళకంధరకంఠగతహాలాహలజాల
గురుతరద్యుతులతో సరసమాడి
బర్హిపించ్ఛచ్ఛటావరకిరీటోల్లస
ద్వధువపుఃకాంతితో వియ్యమంది
ఘనఘనాఘనకాండకస్తూరికానవ
చ్ఛవిపరంపరలతో నవఘళించి

కకుబంత వేదండగండస్థలోచ్చల
దలికులంబులతోడ ననఁగి పెనఁగి
గీ. రాజిలెననంగ రోదోంతరాళమందు
బంధకీబృందపరమాప్తబంధువగుచుఁ
గజ్జల కరిఘటా కలకంఠ కాల
కాంతితతిఁ గ్రమ్ముకొనె నంధకార మపుడు. 4

మ. బళిరా! యియ్యది మంచివేళ యెవరేఁ బైవారు గుర్తింపఁగా
వలనుం గాదని రాముఁడున్న యెడకుం బైళంబ విచ్చేసెఁ బో
వలయుం బైష్ణవు చెంత కర్థమునకై వాఁ డిప్పు డీకున్న న
వ్వల యోచింత మటంచు బొజ్జయ వచింపం బైనపై రిర్వురున్.

కం. బెదరుచు రాముఁడు ధైర్యము
గదురనిచిత్తంబుతోడఁ గడుఁ దడబడుచుం
"బదపద" మన బొజ్జయ త
త్సదనప్రాంతం బొకింత దవ్వుగ నుండన్. 6

మ. అనుమానింపఁగ నగ్గునగ్గునకు రమ్మాయంచు బొజ్జయ్య తా
ఘనబాహాబలశక్తి నీడ్వఁగను జిక్కంబట్టి ధైర్యంబు వే
చను భీతింగను వద్దు పోదమను నాశంకాత్మసింహావలో
కనముం జేయును రాముఁ డెవ్వరయినం గాన్పింతు రేమోయనున్.

కం. ఇదె వచ్చితి మిదె వచ్చితి
మదియేమిర యింతభయము నంబెదు తుదకుం
బద యీసందు మొగంగల
దదియేసుమి దొడ్డిగుమ్మ మనె బొజ్జయయున్. 8

కం. ఇటుగని యటుగని చీమయుఁ
జిటుకుచిటుక్కనని చిమ్మచీకటిలోనం

దటుకున రాముం డపుగిదిఁ
గుటిలాలక యింటిదొడ్డిగుమ్మములోనన్. 9

కం. గండైనపుండరీకము
దండివలం బడ్డయట్లుదారచరిత్రో
ద్దండుఁడు రాముం డా వే
శ్యాండజయాన యిలువొచ్చె నద్దమరేయిన్. 10

కం. అలవాటుకలిమి బాజ్జయ
తలఁపక భయమన్నమాట తటుకునఁ జొచ్చెన్
మెలమెల్ల రాముఁడుం జని
కళవళపడె నచట నెవనిఁ గానకయంతన్. 11

కం. ఆచూకి లేని చోరుం
డేచోటకుఁ బోవలయునొ యెఱుఁగక యాచో
నీచోఁ దోఁచక దిక్కులు
చూచెడుగతి రాముఁ డపుడు చూడఁగఁజొచ్చెన్. 12

కం. అలికిడి చెవిఁబడ వైష్ణవ
తిలకుఁడు గుడి యెడమ వెనుక దిక్కులయందున్
నలుఁగుడువడు తెలియుడుపులఁ
బలురకముల "సర్దుకొంచు" బయటికివచ్చెన్. 13

కం. ఆలోన వచ్చె నచ్చటి
కాలోలమృగాయతాక్షి యాపె మదను ని
ల్లాలో తొలకరిమెఱుపుల
జాలో యని రాముఁడపుడు సంభ్రమమందెన్. 14

ఉ. ఆమదిరాక్షి పద్మిని యొయారముగాఁగని పల్కె నిట్లు మా
స్వాములు మీరాధనం బిడక జాగొనరించిరిచాల వేళుగా

మీమది నెంచగావలదు మేలె ఘటిల్లిన దట్టులౌట శ్రీ
రాములవారిదర్శనము ప్రాగ్భవపుణ్యమునన్ లభించెఁగా!

కం. పెద్దలతో పని చిల్లర
పద్దైదైనను వసూలుపడుతోడన మీ
పద్దిండని చెప్పదు నే
ప్రొద్దును "సుస్తీసుమండెపుడు" స్వాములకున్. 16

గీ. వారితో మీకుఁ బనిలేదు వార లున్న
లేకయుండిన మీడబ్బు మీకె యిడుదు
రేపు రండని బొజ్జయ్యవైపు చూచి
వచ్చుటనుఁ 'బూచి' మీదని పలికె నపుడు. 17

ఉ. చెప్పెడిదేమి యింక వెలచేడియ చెప్పుట యొప్పమీఱఁగా
నప్పయి వైష్ణవప్రవరుఁ డద్ది సమర్థముచేయు టాపయిన్
విప్పగ బొజ్జయాహ్వయుఁడు నేర్పునఁ బల్కుట తప్పదంచుఁ దాఁ
"జప్పన" రాముఁ డింటిదెస సాగఁగడంగెడునంతలోపలన్. 18

చ. అలయక "కానిమేజుపయి" నాడుదమంచును 'బేక' గల్పి ము
క్కల వెలకాంత పంచగను గల్గియుఁజిత్తము రాముఁ డాడఁగా
నోడఁబడఁడయ్యె సిగ్గు భయ ముద్దవిడిన్ మది నగ్గలింప వా
రలు ముగు రాడి రాతఁడును బ్రక్కను జేరి హాసించుచుండఁగన్

సీ. పనిలేనివారల పాలింటఁ బెన్నిధి
యెల్లకార్యంబుల కెదురుచుక్క
కుటిలాత్మకుల కెల్లఁ గొంగుబంగారంబు
మచ్చరంబునకు బల్ రచ్చపట్టు
వీక్షించువారికి వెలయాలి చనుదోయి
తగులుచలములకుఁ దార్పుగత్తె

తిరిపంబు నెత్తింప దివ్యోపకరణంబు
మాయదారుల "కొజ్జుమారికమ్మ"

గీ. పాడునిద్రాలతాంగికి బావగారు
గౌరవప్రపత్తులకెల్ల వేరుపురుగు
వ్యసనసందోహమున కంకురార్పణంబు
పేరు పెంపును గూల్చెడుబేస్తులాట 20

కం. సద్దణఁగినపిమ్మట నా
యిద్దరును గలిసియ వచ్చి రిండ్లకు మఱునాఁ
డద్దమరే యగుచుండఁగ
నుద్దవిడింబోవఁదలఁచియుండిరి మరలన్. 21

కం. అచ్చరలఁబోలు వెలయాం
డ్రిచ్చపుపురినుండి బ్రిహ్మయానతిఁ బ్రీతిన్
వచ్చియుఁ బద్మినియింటను
మచ్చిక బసచేసి రొక్కమాసముక్రిందన్. 22

వ. ఇళాత్రివేణీకుంజరీనామంబుల నాపువ్వఁబోండ్లు ముప్వురునునివ్వ
టిల్లుచుఁ బద్మినీసాహచర్యంబున వైష్ణవవతంసునకును దలలోని
నాల్కలై మెలంగుచు నిరంతరచతుర్ముఖపురాణపారాయణపరా
యణలై యుల్లాసంబునఁ గాలంబు వెళ్ళఁబుచ్చుచుండిరి. పద్మినీ
సద్మంబున నంతకు మున్నె వేశ్యాస్వవాయంబునకు శిరోభూష
ణంబునా నొప్పునొక్కకాంతారత్నంబు గల దాపె వృత్తం
బెట్టిదనిన. 23

చ. అరుదగు శ్యామలాపురమునందు ధనాంగన లక్ష్మిపేరిటం
బరఁగు వినీతయోర్తు నిజనందన ఘూర్ణితముఁగానిపుష్పముౝ

సరవి నలూనపల్లవముఁ జయ్యన వెంటను బెట్టుకొంచుఁ దా
సరసపురంబటంచు విరజాపురి వచ్చి వసించె నిమ్ముగన్. 24

కం. నందనవనమందుంగల
సుందరకల్పద్రుమంపు సొం పొదవెడు నా
నందనసౌందర్యం బా
నందం బొనఁగూర్చె లోకనయనంబులకున్. 25

గీ. అతివ భుజములు మించును లతలసౌరు
సతికి నూఁగారు తలఁపంగ లతలబారు
లలన సంహననద్యుతి లతలఁ గేరు
నతల కుతలాదులం దట్టియతివ గలదె? 26

ఉ. సుందరమైనదేహరుచి సుందరసద్రదకుందబృందముల్
సుందరనేత్రయుగ్మమును సుందరకంఠము సుందరాస్యముల్
సుందర మేదిమెంచిన వసుంధర నాతరళాక్షి నందముల్
సుందరి యంచు సన్మధురసూక్తులఁ బిల్తురు సార్థకంబుగన్. 27

సీ. హరిమధ్యమును దూఱు నాకసంబును గేరు
నపురూపమైనట్టి యతివ నడుము
పద్మరాగపుసౌరు పగడాలజిగి మీఱు
నమృతంబుఁ జిలికించు నధరతలము
ఇంద్రనీలము నేలు నిందిందిరముఁబోలు
ముద్దుగారెడు కల్కి ముంగురులును
పాఠీనముల మించుఁ బద్మంబుల హసించుఁ
జేరలఁ గొల్వనౌ చేడెకనులు
గీ. భువనజాలంబు నొక్కటఁ బూవువిల్తుఁ
డెదిరి గెల్వంగఁ బదునిడి యదిమిపట్టి

నూటి మెక్కుడి సంధించు భూరిశాత
సాయకప్రకరంబు దృక్సంచయంబు 28

కం. వెలలేని కెంపు హా తెఱ
వెలలేని పసిండిగిండ్లు వెలఁది కుచంబుల్
వెల యేఁమీావలయునో య
వ్వెలలేనిసువర్ణకాంతివెలయు వెలఁదికిన్. 29

సీ. అబ్జాక్షి లలితంపుటాస్య మాలోకించి
నక్షత్రపతి మోము నలుపువా ఱె
వగలాఁడి పొగరుగుబ్బలఁ గాంచి దాడింబ
ఫలముల్ పటీలుసఁ బగిలిపోయె
హరిమధ్య గమనంబు కరిణీమతల్లిక
గాంచి లజ్జించి నాగమ్మ యయ్యె
చంద్రాస్యగళమును శంఖంబు తిలకించి
సాగరమ్మునఁ జొచ్చి దాఁగియుండె

గీ. నౌర! తత్తనూసౌష్ఠవంబరసిచూడ
యక్షగంధర్వకిన్నరాబ్జాక్షులందు
మఱియు నేసుందరీపరంపరలఁ గాని
కంచుకాగడా వైచిన గ్గానననగునె. 30

ఉ. రక్తము కండ్లఁజూతు నవురా! నను గెల్తువె యంచు బల్క్రుధా
సక్తత సుందరీరదనసంతతితోఁ గలహించి బద్ధమై
శక్తి కృశించి చిల్లివడి సారెకుఁ దా శరణంచు దానిచే
ముక్తత నొందెఁ గానియెడ ముత్యము ముక్త యదెట్టులయ్యెడున్

కం. సుందరి గతి మత్తేభము
కందము కచపాళి చంపకము నాస వచో

బృందంబు మత్తకోకిల
యెందరసిన దాసివృత్త మెన్నం దరమే. 32

సీ. మేషంబునందున్న మిన్కులనిధి కుచ్చ
రాహునకు వృషభరాశి నుచ్చ
కర్కాటకమున నొక్కట బృహస్పతి కుచ్చ
బుధునకుం గన్యలోం బొసంగు నుచ్చ
అల తులారాశియం దర్కాత్మజున కుచ్చ
శిఖికి వృశ్చికమునం జెలంగు నుచ్చ
మకరలగ్నంబున మహికుమారున కుచ్చ
దానవగురునకు మీన ముచ్చ
గీ. వృషభమున శీతరోచికి వెలయు నుచ్చ
వీరికెల్లర కొక్కొక్కవేళ యందె
సంఘటిలు నుచ్చ కాని యశ్రాంత మల్ల
రమణి ముఖచంద్రునకుం గళారాశి నుచ్చ 33

సీ. మిహిరపుత్రునకు మేషరాశిని నీచ
యిందుజునకు మీనమందు నీచ
అల తులారాశియం దబ్జాప్తునకు నీచ
గ్లౌ రాహులకు వృశ్చికమున నీచ
కర్కాటకమున నంగారకునకు నీచ
శిఖికి వృషభరాశిం జెలంగు నీచ
మంత్రి గీష్పతి కల్ల మకరరాశిని నీచ
కవికిం గన్యారాశిం గరము నీచ
గీ. అన్నిటికిని నొక్కొకదాసియందె నీచ
సుందరికి తనుమధ్యమమందు నీచ

వక్రగతినీచ మృషనీచ వసుధ యందు
నీచఁబడఁ బెక్కు లుచ్ఛయై నెగడుఁగాదె. 34

ఉ. దాని మనోహరాకృతియు దాని మిటారపుగబ్బిగుబ్బలుఁ
దాని మనోజ్ఞనేత్రరుచి దాని కపోలపునైగనిగ్యముఁ
దాని శనైశ్శనైర్గతియు దాని వినీలశిరోరుహద్యుతుల్
మానవకోటిఁ బట్టుటకు మన్మథుఁ డొగ్గిన యుచ్చులౌఁగదా! 35

సీ. డంబు పెంపెసలారు బింబోష్ఠి పెందొడల్
రంభాపటుత్వసంరంభ ముడుపు
శుకవాణి నునుమేని యకలంకమగుశోభ
హేమాధికారంబు నీసడించు
రోలంబనిభవేణి వాలుఁజూపుల ఠీవి
హరిణీవిలాసంబు నపహసించు
బాలామతల్లికాఫాలసౌందర్యంబు
చంద్రరేఖాస్ఫూర్తిఁ జక్కఁబెట్టుఁ

గీ. దరుణి లలితశృంగారసుధాసమాప్తి
మంజువాణీవిలాసక్రమంబు నోడుచు
దివిలతాంగుల మించు నయ్యువిద యనిన
భువిలతాంగుల పేరెత్తఁబోలునొక్కొ. 36

సీ. పరకాంత మాతృభావమునఁ జూచుకుటుంబి
సుందరిఁ గనుఁగొన్నఁ జొక్కిపోఁడె
చిఱుగాలి తిని యుండుపరమహంసయుఁ దాని
పద మాశ్రయింపఁగఁ బాలుపడఁడె
ఇనుపగోఁచినిఁ బెట్టుమునిచంద్రుఁడును దాని
ముఖచంద్రబింబంబు ముద్దుగొనఁడె

'అసలె' రాగములేని యతివతంసుఁడు దాని
వలపువాసనలచే నలమఁబడఁడె
గీ. యంగనల నెఱుఁగనిఋశ్యశృంగుఁడైన
శృంగభంగంబు నొంది యనంగరంగ
సంగతుఁడుగాఁడె యిఁక నే మనంగవచ్చు
సుందరి యనంగ నొకమచ్చుమందుగాదె. 37

చ. తులగనరాక యొప్పెనఁగు తోరపుటందము నివ్వటిల్లఁగా
సలలితవృత్తి నచ్చపురిచానలతోఁ దలతోఁకలేని పొ
త్తులగమితోఁ బ్రమోదగతితో రమణీయవిలాసకేళితో
మెలఁగుచునుండు నమ్మొలఁత మేలనిలోకము మెచ్చిచూడఁగన్.

వ. అట్లుండ నమ్మరునాఁడు బొజ్జయరాములు వేగిర మోగిర మారగించి ధనార్థ మద్ధనాంగనయంగణంబునకుం జని రయ్యవసరంబున వైష్ణవవతంసుండు త్రివేణీకుంజరీపద్మినీసుందరులచేఁ బరివేష్టితుండైయుండ బొజ్జయరాము లాతావుఁజేరిరి. బొజ్జయ్య పరమానందభరితాంతరంగుండై వారలతోడ బేస్తాడఁ బెల్లుబలాటపడినందుల కా వైష్ణవుండు వాని కవ్వరంబొసంగెఁ గాని రాముండు బేస్తాట కేమాత్ర మంగీకరింపమి వాని నూరకయ కూర్చుండనిచ్చుట యుచితంబుగాదని బేస్తాటపట్ల నెల్ల రొక్కమాఱు మహాత్యాగం బొనరించి యడ్డాటకుఁ గడంగిరి. వెండియు వారు వెరసి యేడ్వురగుటచే నడ్డాటకును నడ్డంకు వాటిల్లె. 39

కం. భంగం బొదవఁగ నంతట
దొంగా టాడుదమటంచుఁ దొయ్యలిగమి బల్
శృంగారరసమొలుకఁ బ
ల్కంగాఁ దక్షేలనంబు గడలుకొనంగన్. 40

ఉ. ఆటల సుందరీరమణి యం దొకముక్కను దప్పవేయఁగా
బోటి యిదేటినాయమని బొజ్జయ సుందరిఁ జూచి పల్కఁ న
బ్బోటి విలాసమొప్పఁగతి బొజ్జయతో ననె నవ్వినవ్వి దొం
గాటయ కాదె యిద్ది యటులాటను నాయది నాయమేక దా! 41

ఉ. బొజ్జయ చూచి యచ్చపురిపొల్తుల మోహరసాబ్ధిమగ్నుఁడై
పజ్జకుఁ జేరి వారి తనుభాగము రాచుకొనంగ జేకుచున్
లజ్జయు గిజ్జ లేని వెలనారులతో బళిరా యతండిఁకే
లజ్జయు లేక కేరుచు విలాసము మీఱుచు నాడెఁ బోఁడిమిన్.

ఉ. రాముఁడు సుందరీవదనరాజు నెగాదిగఁ జూచి నైజని
ష్కాముఁడెయయ్యు నయ్యెడలఁ స్వాంతమునం జలనంబునొందియా
రామ యొయారముల్ బలుకుప్రౌఢియు మాటికి మాటికెంచి యే
మేమొ తలంచు వంచుఁ దల యింక నధోగతి వేఱయున్న దే. 43

వ. అంత నిశీథ మగుటయు రాముఁడు చింతాక్రాంతస్వాంతుండై పోవనుద్యుక్తుం డగుచుండ సుందరి మందస్మితంబుతో "నేమంత తొందర వెడుదురు గాని లెండి' యని పలుక నాకలికి కులుకుపలుకులకు భంగపాటు వాటిల్లనొల్లమి నొక్కింత తాళిన వెనుక వెండియు నాలస్యంబగు డారాముఁ డాగ్రహావలోకన సూచికాపరంపరల నాబొజ్జయపైఁ బఱపిన నాతం డది గ్రహించి తటాలున లేచి త్రివేణీకుంజరులఁ దనివార నోరచూపుల జూచుచుఁ గడు కష్టంబున దారితీసె నంత బొజ్జయరాము లవ్విటనిధానంబగు నాకటికిచీఁకటింబడి మొగులకంటఁబడక యింటికిఁ జేరిరి కాని వేళ దాఁటుటనో పూలవిల్తుని బారిం బడుటనో కాని బొజ్జయ్య కంటికి నిదుర లేదు. రాముండును 44

కం. తరుణీమణులవిలాసముఁ
బరికించుచు మఱచినాఁడఁ బరమార్థంబున్
ధర నీఁగయు నిల్లలుకుచుఁ
బొరిపొరి తన పేరు మఱచుపోలిక యయ్యెన్. 45

వ. అని విచారించి యీసారి మఱపు ఘటిల్లనీక యావైష్ణవుని ధనం బడుగవలయు. కాదు కాదు ధనముం బోయినఁ బోవుఁగాక పలుగాకిమూఁకలగు నారూపాజీవికలపాలికిం బోనొల్ల నీ బొజ్జయ్యకతంబునఁగాకున్న నేనెన్న డేసియు నట్టితావున నడుగుఁ బెట్టితినే యిఁకేమైననుసరే యచటికిఁ బోనొల్లనని యుల్లంబునఁ బెల్లుగా సంకల్పించుకొని యారేయెల్లసుఖసుప్తిం బొందెనంత

కం. మంకెనవిరి విచ్చినక్రియఁ
గుంకుమ ప్రోవిడినభంగిఁ గురవకకరవీ
రాంకితమగుబంతి గతిన్
బంకజబాంధవుఁడు వొడిచెఁ బ్రాక్శైలమునన్. 47

ఉ. ఎప్పుడు పొద్దుగ్రుంకు నిఁక నెప్పుడు వేశ్యలతోడఁ గూడి నే
నొప్పుగఁ బేకనాడఁగలనో యను బొజ్జయ భానుఁ డెప్పుడున్
'జప్పున'ఁ గ్రుంకువాఁ డిపుడు జాగొనరించె నదేమిపాపమో
యిప్పుడె పోదునన్న 'నసలే' యరుదేరఁడు రాముఁ డంచనున్.

కం. అహామంతయు బొజ్జయ పడు
తహతహ గని జాలినొంది తపనుం డుదధిన్
రహిఁ గ్రుంకి కూర్చె నతనికి
బహుళామోదంబు లోకబాంధవుఁ డగుటన్. 49

వ. త్రివేణీకుంజరీకంజాక్షులయందు గాఢానురాగంబు గలబొజ్జయ్య యహస్కరు నోరార దీవించి వేగిర మోఁగిర మారగించి యప్పుడే

బోనం బొనరించి లేచినరాముని గాంచి రామా! యింత
యేమరి యుందువేల? ఈలీల నూరకున్న మనడబ్బు వచ్చుట
దుర్ఘటము. ఎడపదడప పోయి యడుగకున్న మన మర్థము దాస
వదలుకొనవలసివచ్చు నిప్పుడేపోయి నిక్కచ్చిగా నైష్ణవు నడుగ
వలయురమ్మనిన విని రామావనీసురుండు నిస్పృహత్వంబున
మిత్రమా! ఇది కానిపని మాటిమాటి కా పడుపుంగొమ్మల
యింటి కేగరమ్మని హెచ్చరించెద విది న్యాయంబుగాదు. 50

చ. ధనమును నీవ లాగెడువిధానము నూడుము యంతెకాని నా
మన మటుపోవనీదు మటుమాయలమారులు వారనారు లా
ననవిలాసవిభ్రమవినమ్రవచోనిచయాంశుగంబులన్
మనసిజబంధనాలయమునన్ బడఁద్రోయుదు రెంతవారలన్. 51

ఉ. చిందరవందరయ్యెఁగద చిత్తము సుందరి నందుఁ జూచినన్
బొంద మనస్సులేదు మఱి పోవుట యెందుల కౌర యగ్గిప
జ్జం దగఁ జేరుకొన్న నది "సాఫుగఁ" గాల్చక యుండునో కొక్కొ నీ
విందుఁ బ్రమాద మంచెద విదేలర బొజ్జయ యన్న నాతఁడున్

కం. కుందనపుంబొమ్మలు వా
రిం దగఁ గూడుటకుఁగాదు రెపరెపమను నా
సుందరితోఁ బేకాడుద
మిందుఁ బ్రమోదమె ప్రమాద మేది సఖుండా! 53

వ. అని తన్నుఁ బట్టువఱుపఁ బ్రయత్నించు బొజ్జయును గోపదృష్టి
నీక్షించి వానిహృదయంబు సత్పథంబునకు మరల్పనెంచి
రాముఁడు హితవాక్యంబుల నిట్లను. 54

కం. ఎంతటిజితేంద్రియులు నిం
కెంత శిలోచ్చయహృదయులు నెంతటి విద్యా

వంతులు మతిమంతులయినఁ
గాంతల మైగాలి సోఁకఁ గరఁగరె మదిలోన్. 55

ఉ. ఆకు లలంబులందినుచు నంబువు మాత్రమె క్రోలి యింద్రియా
నీకములన్ జయించినమునిప్రభులే మును పూవుఁబోండ్లకై
యాకులపాటు నొందిరన నద్దిర షడ్రసవస్తుభోక్తృతా
ఖ్యాకులమైనయట్టి మనసా! యిఁక లెక్క తలంప నిత్రపా 56

మ. అలినీలాలకముల్ స్మితప్రచురవక్త్రాంభోజరాజమ్ములున్
గులుకుంగుబ్బలయుబ్బుఁ దేనెపలుకుల్ గుత్తంపుమైదీవయున్
దిలకింపన్ బులకింపకుండుటకు నీదేహంబు లేమంతగా
శిలలా! లోహములా! కఠోరకులిశశ్రేణీసమానంబులా! 57

చ. మగువలచూపుటంపరల మ్రగ్గనివాఁడు మనోహరంబుతా
మగువలమాటల న్మరగి మ్రందనివాఁడు సవిభ్రమంబుతా
మగువలచేష్టలం దెలివిమాని చలింపనియట్టివాఁడు ము
జ్జగముల లేఁడు లేఁడనుచుఁ జాటరె తొల్లిఁట ధీమదగ్రిముల్ 58

సీ. చింతామణీపాదసేవారతుఁడు గాఁడె
లలితాత్ముఁడైన లీలాశుకుండు
పద్మావతీపాదపద్మభృంగము గాఁడె
కాళికాభక్తుఁడౌ కాళిదాసు
దేవదేవికిఁ జిక్కి తిరుగఁడే హరిపరా
యణుఁడైన విప్రనారాయణుండు
బాలామణీపాశబద్ధుఁడై యుండఁడే
సుకృతాత్ముఁడగు మధుసూదనుండు

గీ. ముట్ట మంటము పలుకము ముగ్ధము మేమ
మనుచు బింకాలు మాపిన యట్టివారి

పులుఁగులైనారు వెలయాండ్రవలలలోనఁ
బొల్చిచూచిన మన మెంత బొజ్జయాఖ్య! 59

గీ. వ్యసనములఁ జిక్కరా దెవండుఁగాని
చిక్కనేయేని మాను టింకెక్కడగును
పుట్టె నొకమాఱు దుర్బుద్ధి పుట్టెనేని
పుడుకలనుగాని పోదను నుడువు వినవె. 60

వ. బొజ్జయ్య యాపలుకులాలకించి కించిల్లీలాపహాసంబొనరించి రామా! మన మచ్చటి కూరకయ పోవుచుంటిమే. గంపంత కార్యంబునుంగలదుగదా! లక్ష్మీపట్ల నుపేక్ష యెరికిం దగదు. ఉపేక్షించువానిపక్షంబున లక్ష్మీ పరాఙ్ముఖయై యుండుఁగదా యని ప్రోత్సహించు నాహితుని వాక్యంబు విని రాముండు 61

చ. బలితపురాచకార్యములు వాటిలినన్ బను లెన్నియుండినన్
వెలచెలి యింటి కేగునెడ వేఱె తలంతురు తాడిక్రిందఁదా
నిలఁబడి పాలుద్రావినను నిక్కముగా నది కల్లెయందు రి
య్యిలపయి వేఱుగాఁ దలఁపరేకద లోకులు కాకులాటచేన్. 62

ఉ. లోకము జోలి యేలయని లోఁ దలపోయఁగరా దెవండునే
నీకఠినప్రపంచమున నెల్లఱ కీర్త్యపకీర్తు లన్నియున్
లోకుల వాకునన్ నిలుచు లోకమె మెచ్చినఁ జేకుఱుంగదా
నాకము తజ్జనస్తుతి వినా సురలోకము సున్న యేసుమీ! 63

కం. మన యన్నమె మనము తినియు
మన బట్టయె మనము గట్టి మహి లోకులకున్
ఘనముగ వెఱవంగావలె
నను సామెతను వినలేదె యనఘచరిత్రా! 64

వ. అని హితంబువలుక బొజ్జయ్య ముఖమున విన్నదనంబుదోఁప65

చ. అచటికిఁ బోవకున్న మన సాఁగదు పోవుదునన్నఁ బోవనీ
దెచటికి నొంటిగా జనని యీవును వచ్చెదవేని తోడు న
న్నెచటికి నైనఁ బంపు నొకయింతయు సే ననుమానముండ దో
యచలమనస్క! నాకొఱకు నచ్చటకుం జనుదె మ్మటంచనెన్.

కం. అడుగుచు బతిమాలుచుఁ ద
న్నొడఁబఱుపఁగ రాముఁ డందు కొడఁబడుచుం బోఁ
దొడఁగెను బొజ్జయ వెంటన
చెడుగును మంచియును గూర్చు స్నేహం బెపుడున్. 67

వ. ఇరువురును బయలుదేరి వైష్ణవప్రవరుం డున్నతావునకుం జన నచ్చట నచ్చపుపురీలలనాత్రియంబును సుందరియుఁ బద్మినియుఁ బంచముఖి పురాణపారాయణంబు సేయుచుండిరి. 68

కం. పంచాస్త్రుఁడు వంచిన శర
పంచకమో పంచజనుల పంచేంద్రియముల్
వంచించి కాల్పఁబుట్టిన
పంచాగ్నులో తన్మనోజ్ఞపంచమకంఠుల్. 69

వ. వా రేవురు నభ్యుత్థాన మాచరించునంతలో లోనుండి వైష్ణవ వతంసుం డరుదెంచి యష్టముఖీఖేలనాప్రతిష్ఠాపటిష్ఠుఁ డయ్యె. వారు వారకాంతాముఖేందువినిర్గతవాగమృతరసంబుఁ గ్రోలుచుఁ జాలసేపు తత్త్ఖేలనాలోలుపులై మేలంబులాడుచుఁ గాలంబు పుచ్చుచుండి రంతలో సింద్రజాలంబుచేతనో యనఁ దటాలునఁ గనుసన్నలఁ జేసన్నల నెల్లవార లదృశ్యులైరి. సుందరీరాములు మాత్ర మాగడియం దుండిరి. కవాటంబు వెలుపల ననర్గళంబుగా నర్గళితంబయ్యె నంత. 70

కం. చకితుండై తత్తరమునఁ
బ్రికటమ్ముగఁ దలుపువట్టి పడలాగుచు బల్
వికృతిక్రియాపరులు వా
రకటకటా వెడలిరంచు నాతఁడు గదిలోన్. 71

చ. ఇటునటుచూచుఁ దల్పుగడె నిట్టటు లాగఁగఁ జూచుఁ జాపపైఁ
గుటిలవినీలకుంతలను గ్రూరపుఁజూడ్కులఁ జూచుఁ దోడనే
యటునిటు వెఱ్ఱిచూపులను నల్లన భూతముసోఁకినట్లుగా
సటమటమంది చూచు వెలయా లదిచూచి హసించు నింపుగన్.

గీ. భీతినొందియు ధైర్యంబుఁ బిగ్గఁబట్టి
రాముఁ డాసీనుఁడౌచుఁ బర్యంకతలిని
సుందరీనవవదనారవింద మందు
దృగ్మిళిందంబులను సంచరింపఁ జేసె. 73

ఉ. క్రిందను గూరుచుండి పరికించుచు రామునిచేష్టలెల్ల నా
సుందరి కొంటెమన్మథుఁడు శుద్ధమనస్కునిరాతిగుండె నా
టందగు బాణమోయనఁ జటాలున లేచి యలంకరించెఁ ద
న్మందిరమధ్యశయ్యపయిఁ దాఁకుచు నాతనివామపార్శ్వమున్.

చ. నవకపుటూర్వశిం గను ధనంజయుఁడయ్యెనొ రాముఁ డయ్యెడన్
బ్రవరునిరీతి సుందరి విభాసురపార్శ్వముఁ బట్టి తోసెనో
యువిద నతాననాబ్జయయియూర్పులువుచ్చుచుఁబుల్కుపుల్కునన్
దవిలినచూపుఁజూపు మెయి నాటఁగ నీటుగఁ జూచి రామునిన్.

గీ. చూతు మిమ్ముల నేవేళ సుందరాంగ
వంచినతల యెత్త వదేల యించుకైన
నలువురందునఁ దలయెత్తి మెలఁగవలదె
భాగుపడఁగోరువార లెవ్వారుగాని.

చ. కవిత రచించుజాణలని క్రమబుధాఢ్యసభాంతరంబులన్
బ్రవిమలవాక్సమృద్ధి గలవారని మున్నను వింటినయ్య త
త్కవనపుఁగాంచనంబునకుఁ దావి ఘటిల్లుట మమ్ముబోంట్లనున్
గవయుటఁగాదె పూర్వకవినాథులయున్నతు లీ రెఱుఁగరే! 77

సీ. చింతామణీనామ చింతనమ్మునఁగాదె
లీలాశుకున కంత మేలు గలిగెఁ
పద్మావతీబాహు బద్ధుఁడౌటనుగాదె
కాళిదాసున కంతఘనత వచ్చె
శ్రీవిరాజితగణికావిలోలతఁగాదె
శ్రీనాథుకవితకుఁ జేవ యొదవె
వేశ్యాధరామృతాభిగమమ్ముచేఁగాదె
ధూర్జటి మాధుర్యధుని జనించెఁ
గీ. బెద్దకవులకుఁ బెట్టినభిక్ష మేము
కవిత కాశ్రయములు మేము కవులు మాకు
నాశ్రితులుగారె విమలవిద్యాప్రవీణ!
ప్రౌఢకవితకు మాపొందె పట్టుకొమ్మ. 78

సీ. పదములం దనురక్తి పరిఢవిల్లును మీకు
పదములం దనురక్తి పరఁగు మాకు
అర్థమం దాసక్తి యతిశయిల్లును మీకు
నర్థమం దాసక్తి యడరు మాకు
సకలకళాశాస్త్ర వికసనంబును మీకు
సకలకళాశాస్త్ర సరణి మాకు
సరసుల కామోద సరణి గూర్చుట మీకు
సరసుల కామోదసరణి మాకు

గీ. సభల రంజింపఁజేయు నాసక్తి మీకు
సభల రంజింపఁజేయు నాసక్తి మాకు
అన్నిఁటను మీకు మాకును నైక్యమమరఁ
గడకు శయ్యావిభాగ మేర్పడఁగ నగునె? 79

చ. అదియునుగాక యెప్డు సఖులందరిలోపలఁ దారలందు నిం
పొదవెడుచందమామగతినొప్పెడు మిమ్ములఁ గాంచి యగ్గమై
మదనకృశానుకీలలకు మానసవీథిని మిమ్ము నిల్పి స
మ్మదమునఁ దేలియాడెదఁ బ్రమాణముసుం డని కౌఁగిలించుచున్.

గీ. సరసఁ గూర్చుండి చెక్కిలి చక్కనొక్కి
రతికిఁ దార్పంగ రాముండు ధృతినిఁ బలికెఁ
గిచకిచలు లేవు రాతికిఁ గీరవాణి!
అస్మ దింద్రియజయమున కడ్డు లేదు. 81

సీ. కలకంఠరుతమును గాన కంపెడుపల్కు
పుట్టతేనియ వాఁతఁబెట్టు పలుకు
పంచదారను బటాపంచచేసెడు పల్కు
వెన్నను గరఁగించి వెలయు పలుకు
పనసతొలపసందుఁ బట్టిపిల్చెడు పల్కు
చెఱకుఖండంబును జీల్చుపలుకు
అమృతప్రవాహంబు నడ్డగించెడు పల్కు
తియ్యమామిడివంక దిద్దు పలుకు

గీ. గోస్తనీఫలవ్రాతంబు గొట్టు పలుకు
వెరసి యన్నింటి నొకటిగాఁ గరుడుగట్ట
దానిఁ గనుఁగొని హసియించు దాని పలుకు
వినఁగ మరగియు మార్మోము వెట్టె నతఁడు ౮౨

కం. కానీ యిప్పటి క్షితి
కానీతుండయ్యెఁ బలుకె యాలింపనివాఁ
డే నేఁడో రేపో మన
కౌనన్నటుకాఁడె యంచు నతివ దలంచెన్. 83

కం. ఒండొరులను గెలిచితిమని
యొండొరులు ముదావహులయి యుండిరి సుమకో
దండుం డీబేర మకట!
దండుగయని చనియె దండు దండం గొనుచున్. 84

వ. రాముఁ డంత యథాలాపమ్మున నా తలు పెట్టె లాగిన నది యూడివచ్చెం గాని జనులయలికిడి యొకింతయు వినరాకుండె. బొజ్జయ్య జాడయుం బొడసూపకుండె నంత రాముఁ డాసుందరి కడ వీడుకోల్వడసి తొందరగా నాచీఁకటిం బడి యిలుసేరె. నాఁటిరేయి యచ్చట జరిగినకృత్యంబులకు బొజ్జయ్యను దూష ణాలాపమ్ముల న్యకార్యంబొనర్చియు మఱునాఁటి సాయంకాలం బగుసరికి రాముండు గర్ణపుటపేయంబులగు నబ్బోటిమాటలు వీనులార వినుటకును నప్పాటలాధరపౌఢిఁబలికించు గీతప్రబంధ రసంబు గ్రోలుటకును నయ్యమృతవాఙ్మయాంగనామణితోఁ గేవలము ముచ్చటలాడుటకును బోవనెంచి బొజ్జయ్యను దన్ను నుసరింప రమ్మన నాతండును గౌతూహలాంతరంగుండై రామునిచే నడిగించుకొని యెట్టకేలకు నాతనివెంట నంటుచుండె. అంతం గొంతకాలంబునకు నచ్చపుపురీతన్వంగులు కార్యాంతరాసక్తి నిజపురంబున కరిగిరి. బొజ్జయామాత్యుని సాహాయ్యసంపత్తి లేకయే రాముండు సుందరీమందిరంబున కర్థంబుపేరినెపంబునఁ బోవుచు వచ్చుచుండె. అంతఁ గొంతవడికి సత్యవాఙ్నిరతుండగు

వైష్ణవావతంసుండు రామున కీయవలసిన దిచ్చివేసి ఋణవిము
క్తుండయ్యెఁ గాని రాముండుమాత్రము సుందరీమందిరయాత్రా
యాతయాతనావిముక్తుండు కాలేదు. 85

చ. జిలిబిలిపల్కులుఁ వలపుఁజిల్కెడుపల్కులు మందహాసముల్
దొలఁకెడుపల్కులుఁ జిలుకతోయ్యాలిముద్దులమాటగట్టుమా
టల నుడికించుపల్కులు హుటాహుటిఁ దేటగనాడుపల్కులుఁ
జెలువుగఁ బల్కుపల్కులను జేరి వినంజను రాముఁ డెంతయున్

వ. వలపుఁజిలికియుఁ బలికియుఁ గలయాదలంపని రామునిం గని
యొకనాఁడు 'రామా! పూసినఁ గేవల మసిధారావ్రతంబే
పూనవలెఁ గాని గోలవై యీలీల మిశ్రమవ్రతం బేల యిఁకఁ
జాలింపు'మని యబ్బాల వలుక విని రాముఁడు మందహాస
సుందరవదనారవిందుండై. 87

చ. పిలిచినఁ బల్కకుండి ముఖబింబముఁ జూపినఁ జూడకుండి కౌఁ
గిలి యిడఁ ద్రోసి సల్పునది కేవల మయ్యసిధారయానె తాఁ
బిలిచినఁ జక్కఁబల్కి ముఖబింబముఁజూపిన ముద్దుఁబెట్టి కౌఁ
గిలియిడఁ బట్టి నిల్పునదె కేవల మయ్యసిధారయాననెన్. 88

కం. నెల లీరీతి గతించెను
వెలఁదియు రాముండు మిన్నుల విమలప్రేమన్
వెలసిర కాని యతని మతి
వెలసతిరతి కొఱగదయ్యె వీసంబైనన్. 89

చ. అతఁడు జితేంద్రియుండో మఱియాతని కేమిస్రవతంబు గల్గెనో
యతనికి నామెకుం గలియునట్టిసుయోగము లేదో నాసికిన్
రతికి మనంబులేమి వగ రాఁజగ నప్పుడు సుందరాంగి త
ద్రతిపతిభిల్లభల్లచయదారితయై యనె నిట్లు తెంపునన్. 90

కం. మగతనము లేదె నీవొక
మగవాఁడవె రంభవంటిమగువలమగు మే
మొగిఁ గౌఁగిలీయఁ ద్రోసెదు
మగరూపముఁదాల్చినట్టి మగువవు గావే! 91

వ. ఘనమనీషాయుతుఁడగు రాముఁ డదివిని సుందరీ! నీవెంతమంద బుద్ధిగలదానవు. 92

చ. మగువలు చెంత లేనితఱి మానవులందఱు బుద్ధిమంతులే
యగుదురుగాదె చేడియల హావము లంచితభావబృందముల్
వగలును జూచిచూచి వశవర్తులఁ గాక చరించుచున్న నే
మగువనొ? మానవాగ్రిణినొ? మానిని! లోకము లేదె? తీర్పఁగన్

వ. అని పలికినయప్పలుకులకు సుందరి మాఱుమాటాడ కూరకుండె. రాముఁ డెప్పటియట్ల నిశీథంబునఁ బోవుచు సుందరీవాగమృత రసాస్వాదనపరాయణుండై యొక్కింతయుఁ గలయఁదలంపు లేక విచ్చలవిడిగా సంచరించుచుండ వానిపొందున కాసుందరి యమందప్రియత్నపరంపర లొనర్చి రాముఁడు రవ్వంతయుఁ జలింపకుండుటఁ గాంచి మించినపరాజయంబున దుఃఖించి విసిగి వేసరి నిస్పృహాత్వంబునొంది కుంది వాడి వత్తలయ్యె. 94

కం. ఈరీతిఁ బెక్కుదినములు
వారాంగనతోడి చెలిమి వర్ధిల 'విస్సా
కారంబున' 'ఛీ! పోరా'
రారాకుమనుచుఁ బలికెఁ బిరాదు నుటిల్లన్. 95

వ. సుందరి మగనాసలడంపహ్యామానమానసయై యట్లు తృణీకరింప మానధనుండగు రాముఁ డానిరాకరణంబున కాగ్రహాయత్త

చిత్తుండై యది మొద లసలే యాసుందరీమందిరంబునకుఁ
బోవఁడయ్యె. 96

## —• ఆ శ్వా సా ం త ము •—

చ. సరసిజపత్రనేత్ర! ఘనసారపటీరసుగంధిగాత్ర! ధీ
వరనుతిపాత్ర! దీనజనపాలనసూత్ర! పవిత్రవర్తన
స్ఫురితచరిత్ర! సర్వబుధముఖ్యమహావనచైత్ర! యున్నమ
త్పరవణవీతిహోత్ర! నరపాలక! నారయరాట్సుపుత్రకా! 97

కం. దీనజనతా రసాలో
ద్యానతలవసంత! పవిమలాంతఃకరణా!
మానితగుణమణిరోహణ!
గానకళాకమధురీణ! ఖ్యాతలరమణా! 98

తరల:- సరసపోషణ! సత్యభాషణ! సజ్జనాన్వయభూషణా!
పరవిదారణ! బంధుకారణ! పండితైకగవేషణా!
దురితశోషణ! సూరితోషణ! దుష్టమండలదూషణా!
వరవిచక్షణ! భాసురేక్షణ! భవ్యబృందసమీక్షణా! 99

## గ ద్య.

ఇది శ్రీశిష్టావంశపయఃపారావారరాకాకైరవమిత్ర శ్రీ సూర్యనారా
యణశాస్త్రిపుత్ర బుధజనవిధేయ వేంకటసుబ్బయ
నామధేయ ప్రణీతంబైన హృదయాభిరామ
మను మహాప్రబంధమునందుఁ
ద్వితీయాశ్వాసము



శ్రీరస్తు.




# తృతీయాశ్వాసము.




రమణీయ రమాపద
సారస నిహితాంతరంగ! సద్గుణసంగా!
ధీరోత్తుంగా! రంగ
త్సూరిస్తుతసత్ప్రసంగ! స్ఫురితాపాంగా! 1

వ. అవధరింపు మనంతరంబు 2

సీ. మకరధ్వజుం డనుమండలేశ్వరునకుఁ
బట్టిన శ్వేతాతపత్రమనఁగఁ
బూర్వదిక్కాంత మోమున బొట్టుదిద్దుకొం
టకుఁ జేతఁ బట్టిన ముకురమనఁగ
రమణీయసురవర్త్మ కమలాకరంబందు
మొలిచి విచ్చిన సితాంభోజమనఁగ
ఆకాశకలశాబ్ధి నమరులు మథియించి
పోవానర్చిన వెన్నముద్దయనఁగఁ

గీ. ప్రాగ్దిశను బలారాతి గారాపుఁబట్టి
యాకటను బోరువెట్ట దధ్యన్న మపుడు

కలిపి ముందుఁ బెట్టిన వెండికంచమనఁగఁ
గుముదబాంధవబింబంబు గొమరుమీఱె. 3

గీ. పువ్వుఁబోఁడులు పకపక నవ్వినట్లు
పుచ్చపూవులపోవులు విచ్చినట్లు
వెండి వడఁబోసి వెల్లగా వేసినట్లు
సాంద్రచంద్రిక లలమె దిక్చయములందు 4

మ. కొమరై యొప్పు సువర్ణపీఠముపయిన్ గూర్చుండి గండస్థ హ
స్త మెసంగన్ గడుదీనుఁడై పొడమి కందర్పుండు శీతాంశువై
పు మరల్పన్ నిజదృక్సమూహముల నాపూర్ణేందుఁ డీక్షించుచున్
దమ రాజైన యనంగుముంగిలికి నుద్యద్భీతి నేతేరఁగన్ 5

చ. ఇదియెదొ కొంపముగ్గెనని యొంతయు లో ననుమాన మూని ష
ట్పదములుఁ గోయిలల్ కుముదబాంధవుఁ డేగినదారిఁ బట్టె న
య్యదనున తెవ్వమంచు మలయాశుగుఁడున్ జనుదెంచెఁ గీరముల్
పదపడి వచ్చి నిల్చె స్మరపార్థివుమ్రోలఁ గడున్ వినమ్రతన్. 6

ఉ. వీరినిఁ జూచి మన్మథుఁడు బిక్కమొగంబును వైచుకొంచు వి
స్ఫారమహత్వతత్త్వపరిభాసితులార! మరుత్సుధాంశులా
రా! రమణీయులార! విలు రంజిల సర్వజగత్సమూహమున్
దారుణలీలమై గెలుచు నాకు వెతల్ ఘటియిల్లె నియ్యెడన్. 7

ఉ. పుట్టినదాదిగా విజయభూషణమే కయిసేసినాఁడ నే
నిట్టివిచిత్రమానవుని నెక్కడఁ జూడఁగలేదు వింటిరే
పట్టణరాజమావిరజ భాసిలు రామసమాఖ్యుఁడైన బల్
దిట్టరి నేయఁబోయి యటఁ దీరనిభంగము నొందితిం గటా! 8

చ. అన విని రాకరోషసముదంచితుఁడై యుడుకాంతుఁ డద్దిరా!
కని వినియుండ మున్నెపుడు గాథజయాప్రతిమానదక్షుఁడౌ

ననవిలుకాని బారిఁబడి నారి నరుఁడునుగాని దాఁటిపో
యినవిషయం బపూర్వమిది యెంతటివాఁ డెటులయ్యెనంచనన్. 9

గీ. రాముని జయింపకున్న నా ప్రాభవంబు
గడియలోనూడఁదీయఁడె కమలభవుఁడు
సాయపడి నాపరిభుత చిరస్థాయిచేయుఁ
డీయుపకృతి మఱువ ననె నిక్షుశరుఁడు. 10

ఉ. ఏలికవైనమీకుఁ దగునే యిటు దీనతఁ బల్కఁ జేయకే
యాలము కాకిచేతఁ 'గబు'రంపినఁ జాలదె వచ్చి వ్రాలి మీ
చే లలితాజ్ఞలం బడసి చేయమె చేతులుగట్టుకొంచు ను
ద్వేలపుకార్యభారముల వేయిఁటినైన క్షణంబులోపలన్. 11

గీ. భ్రమర కీరవనప్రియ ప్రకర మిదియె
నీ బలఁగమెల్ల నేతెంచి నిలిచె మమ్ము
పనిగొనుమటంచు నుడురాజు పలుకుటయును
విని ప్రఫుల్లాననాబ్జుఁడై యనె మరుఁడు. 12

సీ. సుందరీవదనంబుఁ జొచ్చి నీవయియుండి
కాంతుల నీనుమా కలువఱేఁడ!
సుందరి నిట్టూర్పునందు నావేశించి
మసలుచుండుమ నీవు మలయపవన!
సుందరి కచబంధమందుఁ బ్రవేశించి
వరలుచుండుడు మధువ్రతములార!
సుందరి గళసీమయందు నిల్కడ నిల్చి
పసమీఱఁ బలుకుమా పరభృతంబ!
గీ. కలికిపలుకుల వెలయుఁ డోచిలుకలార!
మీరు మీమీపనులయందు మిపుల శ్రద్ధ

గలిగి యప్రమత్తులరౌచు మెలఁగుచున్నఁ
బిదప నాపాట్లు నేఁబడియెద వినుఁడు. 13

గీ. కలతెఱంగెల్లఁ జెప్పెడు కలిమి గలిగి
వెలయుదైవజ్ఞవేషంబు వేసికొనుచు
పండొలిచినట్లు గతమెల్లఁ బలికి యవల
గండములు వాని శాంతులు గలయఁ దెలిపి. 14

చ. వెలయుసతీవియోగమని భీతినిఁగొల్పి పరాంగనన్ వెసన్
గలిసినవానిభార్య పెనుగండము దప్పునటంచుఁ దొల్లిటన్
గల దొకసంప్రదాయమని గట్టిగ రాముఁడు నమ్మఁబల్కి రో
వెలఁది మఱుంగు మాటుగొని వ్రేతు నిశాతసుమాస్త్రసంతతిన్

గీ. అనుచుగుట్టుమట్టుల హిమాంశునకుఁ జెప్పి
పదడనుచుఁ దక్కువారల బనిచి యవల
నాత్మకార్యజయాభిలాషాత్ముఁడగుచు
నించువిలుదాలు పిట్టై యదృశ్యుఁడయ్యె. 16

సీ. సంధ్యాద్యనుష్ఠాన సమయ శక్రన్యస్త
మాణిక్యమయ హరివాణమనఁగఁ
బ్రాగ్లలనామణీఫాల భాగాంతరో
దీర్ణేద్ధకాశ్మీరతిలకమనఁగ
ఆకాశపట్టణద్వారదేశోన్నత
గోపురాంచితహేమకుంభమనఁగ
నముచిసూదనసతీనాసాభరణశిఖా
భ్రాజితోత్తమపద్మరాగమనఁగ

గీ. రత్నగర్భావధూటి శీర్షంబునందు
గ్రుచ్చి కైసేయు మాంజిష్ఠరుచి వెలుఁగు

కురవకేజ్జలబంగసూకగుచ్ఛమనఁగ
నరుణబింబంబు దోఁచెఁ బూర్వాద్రితటిని. 17

చ. ఎవ రరుదెంచి యేమి వచియించిరో కాని హృదిన్ జనించెఁ బె
న్నెవు లటు కత్తివ్రేటునకు నెత్తురుబొట్టును గానరాదు రా
మవసుమతీసురేంద్రముఖమండలమందు నెహో పిశాచముల్
దవిలినపోల్కిఁ గన్పడు చతండు చరించెడు వెఱ్ఱిపోలికన్ 18

చ. సతియనుఁ బ్రాణరక్షణముసంగతి యేమను నన్యకాంతతోఁ
రతియను 'ఛీ' యదేమిపని ప్రాణముపోయిన మేలెయంచనున్
గతియిక నేమిరా యను పికావికలయ్యె మనం బటం చికే
గతినయినన్ నిజేశ్వరినిఁ గాచెడుభారము పూనుటొప్పునన్. 19

గీ. తొల్లి మాతాత నను జేర్చి తొడలపైని
మంచిమంచిసంగతుల బోధించునప్పు
డెఱుక పిడికెడుధనమంచుఁ గఱపె నీతి
యదియ యిపు డక్కఱకువచ్చునట్లు తోఁచు. 20

చ. కలదుగదా వెలాంగన యొకర్తుక యిప్పురి మైత్రి దానితోఁ
గలిగెను మున్న మొన్న మఱికాదదియన్యలతాంగి చేరి య
క్కలికినిఁ గోరఁబోవునెడఁ గాదన దాఁ బురుషుండె కోరుచో
నెలతలు బింకముల్ నెఱపనేర్తురటండ్రు రసజ్ఞశేఖరుల్. 21

చ. కనఁబడనీక నాకుఁగలకార్యమునందలిభూరికాంక్ష నే
మునుపటిరీతిఁ బోయి తగుపోలిక ధీరత సంచరించి యా
వెనుక నిజేప్సితంబు నది వెల్లడిసేసిన బెట్టుచూపి యే
యనువునఁగార్యమానెయటులంతయుశీఘ్రముచక్కఁబెట్టెదన్.

చ. అనిమనమందు నెంచి 'వెస' నంచు వచించెఁ బ్రసంగమందు నా
ఘనుఁడగుజోసి యప్పటికిఁ గంజహితుం డపరాబ్ధిఁ గ్రుంగు నా

మన మిపు డేపనిం జొఱదు మాట తడంబడు నౌర! యుండునే
మనసుమనస్సులోనఁ బ్రియమానినికౌ వెతమాట విన్నచోన్

వ. అని తలపోసి సాయంకాలంబగుసరికి బోనం బొనరించి యాసుందరీమందిరంబునకు మున్నటిచందంబునం జనిన వానిం గాంచి యాసుందరి పరమానందభరితాంతరంగయై వానియెడంగల వలపుప్పొంగ నాసమయంబు దాఁటఁబెట్టక యేమేమియోపలికి వాని మనంబు కరఁగింపఁ దలపోయుచుండ రాముఁ డాసుందరీ సౌందర్యంబుఁ గనులపండువుగాఁగాంచి యిట్లు తలపోయఁజొచ్చె.

గీ. కలికి ముఖమున కొక వింతకాంతి యొదవెఁ
జెలువ కచముల కొక వింతచెలువ మమరెఁ
బడఁతి గళమందు నొక వింతపలుకు లురలెఁ
గమలనేత్రకు నొక వింతకళయు వచ్చె. 25

వ. అంత నాసుందరి వల పాపఁజాలక పూలవిల్తునికోలలం బడి పూర్వనిరాకరణంబున నంతయెడఁబాటు వాటిల్లెనని చింతించి వాని సందర్శనంబున నమందానందతుందిలచిత్తయై 26

కం. రాకేందు రాకకై నీ
రాకరమటు రాకరాక యరుదెంచిన నీ
రాకకు నా మానస నీ
రాకర ముప్పొంగిపోయెరా! కవిచంద్రా! 27

గీ. ఇంతమాత్రపుమాటకే యింతవంత
గించి మోమైనఁ జూప వొక్కించుకైనఁ
గరుణ నాపయిఁ బఱపుట బరువె ప్రియుఁడ
మేము తప్పొనర్చినను క్షమింపవలదె. 28

చ. కరఁగిమనంబు నన్ను బిగికౌఁగిటఁ జేరుచుకొందువంచు నే
బిరుసుదనంపుమాటలను బేరిమిఁ బల్కితి నంతెకాని యా
సరసిజనాభుతోడు నెఱజవ్వనమంతయు మీఁదుగట్టి నీ
కరణమునిచ్చుచుంటి నెపుడాత్మఁ దలంప మఱొందుపూరుషున్.

ఉ. కూడిన నిన్నె కూడవలెఁ గూడక నన్నుఁ దిరస్కరింతువో
వీడెదఁ బ్రాణముల్ హరిని వేఁడెద నేఁడెద రామచంద్రునే
ప్రోడిమి భర్తఁ జేయుమని ముందుభవంబునఁగూడ భోగపుం
జేడెల మాటతీరు లనఁజెల్లదు నమ్మము విప్రపుంగవా ! 30

వ. అని దీనంబుగా వేఁడు సుందరిమాటలకుఁ గించిత్ప్రసన్నముఖుండై
రాముండు 31

చ. కలియుటకేమికాని వెలకానినులందు జనించినావు మీ
పలుకులునుం దలంపులును వర్తన లెవ్వియునమ్మరాదు మీ
కుల మొనరించుదోషమది కోటియొసంగినఁ బోదుకాదె యం
చలఁతిగఁ బల్కె రాముని పదాబ్జములంబడి యాపె యిట్లనున్.

చ. తలఁచెద మిమ్మె దైవముగఁ దల్లిగఁ దండ్రిగ నెల్లవారిగన్
దలఁపను వేఱుమానిసిని నాహృదయంబున నెన్నఁడేని నా
వలన ఘటిల్లునేని యొకపాపము తత్క్షణమందె మీరు న
న్విడువుఁ డటంచు దీనముగ వేఁడఁ గవుంగిటఁ జేర్చె నాసతిన్.

గీ. ఆలసించిన నేమౌనో యనుచు నతఁడు
నాలసించిన నేమౌనో యనుచు నామె
యటమటము నొందుచుండగ నాలసింప
మనసిజుఁడుగూడ నేమౌనో యనుచు వెఱచి. 34

మ. అలుకన్ సుందరిచాటు మాటుగొని ప్రత్యాలీఢపాదంబుతో
లలి మోపెట్టిన మేటికార్ముకముతో లక్ష్యావలోకంబుతోఁ

బాలుపారం గసిలీర నేసె శరముల్ పుంఖానుపుంఖంబుగా
నలరుందూపులజోదు రాముపయిఁ ‘జిత్తై’ లేవలేకుండఁగన్. 35

చ. సడలినకౌఁగిలింతలును సన్నకుసన్న గళస్వనంబులున్
వెడవెడకన్నుమూఁతలు వివేకవిచారములేని చేఁతలున్
బొడవగునూర్పుమొత్తములుఁ బొందిక దుంగడు నింపొసంగు న
ప్పడఁతుక తొంటికూటమి యపారసుఖాంబుధి ముంచె నాతనిన్.

గీ. పక్కమార్పులతోడఁ జుంబనముతోడ
మోవినొక్కులతోడ సమ్మదముతోడఁ
గసరుకొనుటలతోడ బల్ కొసరుతోడ
ప్రథమసంగమసౌఖ్యంబు పరిఢవిల్లె. 37

చ. వనితను శయ్యఁ జేర్చి పతి ప్రార్థనసేయ రవంతయైన మో
మునుగననీక గుబ్బలను ముట్టఁగనీక రమింపనీక య
ద్దును గలిగించి పిమ్మటఁ గడుంగడుమోదపయోధిముంచెఁ దాఁ
బనివడి నారికేళఫలపాకములౌఁగద! కన్యకారతుల్. 38

ఉ. తారలబృందముల్ గతులు దప్పుచు నల్లలనాడఁజొచ్చె వి
స్తారమువ్యోమమున్ వణఁకె సారెకుఁగ్రిక్కదలెన్ మహీధ్రముల్
వారక యావరించుకొనె ధ్వాంతసమూహము చంద్రబింబమున్
సారసపత్రనేత్రి పురుషాయితకేళి కుపక్రమింపఁగన్. 39

గీ. ఒకరికొక్కరు తీసిపోకుండ నపుడు
కాయములు రెండు నొక్కటిగాఁగ మెలఁగి
యొండొరుల వీడి త్రుటికాల ముండునెడలఁ
బ్రాణములు వోవు ననుభీతి వరలిరంత. 40

చ. తరుణి ముఖేందుబింబరుచి తగ్గ మనోహరకేశపాశముల్
వరరుచి వాసినట్లు కనుపట్టె నెలుంగు నలుంగుడున్ బడెన్

స్ఫురితవచోవిలాస ముడివోవఁగ నూర్పులు గాడ్పులయ్యె న
వ్విరివిలుకానిపూన్కి నెఱవేఱఁగఁ దద్బల మేగెనోయనన్. 41

చ. చెదరినకుంతలోత్కరముఁ జెక్కుచెమర్చిన మోముఁదమ్మియుఁ
బ్రిదిలిననీవిబంధమును బిట్టును జిక్కులఁబడ్డ హారముల్
బెదరినవాలుఁజూపులును బీఁటలువాఱిన యోష్ఠబింబ మి
ట్లుదవద నొందినట్టి నలినాక్షిఁ గనుంగొని తోడినెచ్చెలుల్. 42

ఉ. వ్రీలినదేఱ కంచుకము వీడియువీడని వేణినుండియుఁ
రాలినవేల సూనములు పాఁబడె నేటికి చీర రక్తిమం
గ్రాలఁగనేల కన్గవ కరంగినదేటికిఁ జుక్క యంచు న
వ్వాలను మేలమాడి రల భామయు సిగ్గున నోసరిల్లఁగన్. 43

వ. కాలక్రమంబున రామునందుఁ గడుంగడు వ్యత్యాసంబులు
వొడగట్టె 44

కం. ఇల్లొల్లఁ డొక్కనిముసం
బిల్లాలినిఁ దొంటిప్రేమ నీక్షింపఁడు న
య్యిల్లాలు చేదుముద్దయు
వెల్లాటవెలంది క్రొత్తబెల్లంబయ్యెన్. 45

గీ. పొద్దుపొడుపులేదు పొద్దుగ్రుంకుటలేదు
గడనకత్తెయింటఁ గాలమెల్లఁ
గొత్తబిచ్చగాఁడు ప్రొద్దెఱుంగనిరీతిఁ
గడపఁజొచ్చె రాముఁ డెడయకుండ. 46

సీ. పగడాలజిగిమించు పదయుగంబులదానిఁ
దొడరి రంభలఁ గేరు తొడలదానిఁ
గలదు లేదననొప్పు కౌను గల్గినదాని
ఘనమైనజఘనంబు గల్గుదానిఁ

బల్లవంబులగిల్లు పాణిద్వయముదానిఁ
దావివీడెపుకావిమోవిదాని
నవసంఖ్యఁ బురుడించు శ్రవణయుగ్మముదానిఁ
బసమించు నెలవంక నొసటిదాని
గీ. మించు మించును హసియించుమేని దాని
దాని నడసోరు నడకించి తనరుదానిఁ
బడియునాఱేండ్లపరువంపు వయసుదాని
సుందరినిఁ గూడి రాముండు సొక్కిపోయె. 47

సీ. కనుచీఁకటులు వ్రాలఁ గడపదాఁటనివాఁడు
కాలరాత్రులఁ దిరుగాఁడఁజొచ్చె
వనితాపరిసంగంబులన మండిపడువాఁడు
గణిక హాస్యములతోఁ గడపఁజొచ్చె
నొకపూఁట తటిదాఁట నుండనేరనివాఁడు
తిండితిప్పలు లేక తిరుగఁజొచ్చె
కులకాంతయెంగిలి కులికి పొక్కెడువాఁడు
వెలకాంత నోట నోరొత్తఁజొచ్చె
గీ. హాస్యమందైన బొంకు లేనట్టివాఁడు
జంకుగొంకును లేకయే బొంకఁజొచ్చె
మహితసుగుణాఢ్యుఁ డెంతలో మారిపోయె
నెటుల మారఁగలాఁడొ తా సింకమీఁద 48

చ. ఇటునటు చూచిచూచి పెరలెవ్వరు నవ్వల లేకయుండ న
చ్చట నడయాడి వెన్బఱచి సాగి దుడుంగున దూఱువాఁడు లం
పటమతియౌచు ఘాటిమెయి వాటముగాఁ జనఁజొచ్చె వేశ్యవా
కిటి కలరామచంద్రుఁడు తెగించినవానికి భీతిగల్గునే 49

సీ. శివలింగమర్చింపఁ జేరఁబోవక వేశ్య
కుచలింగముల పూజకు న్గడంగు
శర్వాభిషేకంబుసమ్మతింపక వేశ్య
కనకాభిషేకంబుఁ గర మొనర్చు
చందనంబీయక సర్వజ్ఞునకు వేశ్య
మెయిపూఁత స్వయముగా మేళవించు
నీరాజనముమాని నిఖిలేశునకు వేశ్య
రహివుట్టురతుల కారతుల నిచ్చు
గీ. తలను దేవతాకుసుమంబుఁ దాల్ప మాని
నిజకరనిపీడ్యమానమౌ నెలఁత తలను
నసి చెడంగన్న పుష్పవాసనలఁ జొక్కు
రాముఁ డవిరత సుందరీ కాముఁడగుచు. 50

చ. దిన మొకయేఁడుగాఁ గడపుఁ దీరక రాముఁడు రాకయున్న వ
చ్చినఁ గని యాపె కౌఁగిటను జేరిచి యెక్కడికేగినావు ని
న్నను ననుఁబాసిపోవఁగ మనం బెటులొప్పిన దగ్నిసాక్షిగాఁ
గొని వరియించుభార్య విటకుంజర వీడవాయంచు నవ్వెడున్ 51

చ. కిటకిటలాడ నెన్నడుము గిండులనేలు నురోజయుగ్మ ము
త్కటపటుకంచుకంపునెఱిదట్టముచే నిఱుకొంది యెంతయుఁ
బిటపిటలాడఁ జూడుకులపిండుమెఱుంగులు పర్వఁ బ్రాల ది
క్తటముల నవ్వువెన్నెలలు గాయఁగ సుందరిచేరు నాతనిన్ 52

చ. తటుకున బాహువల్లరులఁ దా గళసీమఁ బెనంగవైచుచుఁ
బటువయి విఱ్ఱవీఁగు చనుబంతు లురస్థలినాటఁ జేసి మో
మటు పెడనున్నఁ ద్రిప్పుచు నిజాననలక్ష్యసమన్వితంబుగాఁ
జిటుకునఁ జెక్కుగీటి వెలచేఁడియ వాతెఱ గ్రోల నాతఁడున్ 53

ఉ. అక్కున నక్కఁ జేర్చి యధరామృతధారల నానియాని నుం
జెక్కుల నొక్కి ముద్దుగొని చిన్నికుచంబులు బిగ్గఁబట్టి యా
చక్కెరవింటిజోదుపని సందడి దందడి సిగ్గుపట్టులన్
జక్కిలిగింతలన్ బరవశత్వము నొందఁగఁజేయు సుందరిన్ 54

చ. వరుఁడు గుచంబుఁబట్ట సతి వామకరంబునఁ ద్రోయు నాతఁడుం
జులుచులుచూడ్కులన్ బలుప సుందరి మ్రొక్కఘటించుఁ గ్రోల వా
తెఱ నతఁ డామెయున్ బదులుతీరుచు వారి విరాళిమేడ కీ
స్ఫురితవిలాసవిభ్రమసమూహము లారనియస్థిభారముల్. 55

ఉ. 'ముద్దులమూటగట్టి నునుమోవి వెలింగెడు లక్కబుఱ్ఱిలా
గద్దిర! చూచుకొమ్మనుచు నద్దముఁ జేతికొసంగుఁ జూచుచో
ముద్దునుబెట్టుఁ దమ్మరసమున్ నునుచెక్కుల నంటునట్టు లా
ముద్దియ ముద్దుచేష్ట లతిమోహరసప్రసరంబులౌఁగదా! 56

సీ. స్నానంబు పచరించు సమయాన నెలమిమై
వేఁడినీళ్ళను దెచ్చిపెట్టు నొకట
స్నానంబు నగునంతఁ జాకినుడత విప్పి
చక్కగాఁ దడియొత్తి చిక్కుదీర్చుఁ
బుట్టంబు రాముండు గట్టునంతట బహు
విధఫలాహారముల్ వేడ్క నునుచు
నల ఫలాహారంబులైనతోడన హంస
తూలికాతల్పంబుఁ గ్రాలఁజేయుఁ
గీ. దల్పమును జేరునంతలోఁ దాళవృంత
ముఁ గొనివచ్చి విసరి పదములఁ దోడపయి
నుంచుకొని యొత్తుచును బచరించు సేవ
పఙంతి భక్తియు రక్తియుఁ బరిఢవిల్ల. 57

చ. జలకములాడుచో నొడలు చక్కఁగఁ దోమెడుకూర్మిపేర్మికిన్
అలకలు దీర్చి దిద్ది ముదమారఁగ బొట్టును బెట్టుటీవికిన్
బలుమరుఁ జేయుసేవలకుఁ బ్రాయఁపుటింతికిఁ జిత్తనుమ్మెఁబో
చిలుకలకొల్కిసేవలకుఁ జిక్కకయుందురె యెంతవారలున్. 58

ఉ. కోరినచీరఁ గట్టుకొనుఁ గోరినసైకను పీఁకఁ దాల్చుఁదాఁ
గోరినయప్పుడెల్ల మరుకోరికలన్ గడముట్టఁదీర్చు నే
కోరినకోర్కెయైన సమకూర్చును మారువచింప కాంతఁడున్
గోరఁగ హద్దులేదు సమకూర్పఁగఁ బద్దును లేదు దానికిన్. 59

చ. అతనికి దిద్ది స్వీయచికురావళి నావలఁ జక్కఁ దీర్చి బొ
ట్టతనికిఁ బెట్టి యెక్కుడగునందముమీఱఁగ బొట్టుదాల్చి యిం
కతనియెయారపున్నగను నాత్మమనోజ్ఞత నెంచియెంచి యా
సతి "యెవరందమెక్కు"వను సస్మిత సుందర లోచనంబులన్.60

ఉ. రాముఁడు వచ్చువేళకు విరాజితకుందసుమాళి వేణికా
సీమ ఘుమంఘుమార్భటులు చిమ్మ నలంకృతిచేసి కాంచనో
ద్దామవిభూషణావళులు దాలిచి తల్పము సంతరించి స్వ
ర్భామ కుబేరపుత్రికనిరాకరుఁబోలెఁ బ్రబీక్షఁజేసెడున్ 61

సీ. నిలువుపాపట సౌరు నివ్వటిల్లఁగ దువ్వఁ
బొగరుట్టిపడు చుక్కబొట్టుఁ బెట్టు
గళసీమ వెలిగాఁగఁ గంచుకంబు ధరించు
జిలుఁగువన్నియ సన్నవలువ గట్టుఁ
విరజాజిపువ్వుదండ నెఱివేణి నమరించు
మేలిసొమ్ములను నెమ్మేనఁ దాల్చు
జలువపన్నీటిమేల్కలపంబు మెయిఁ బూయుఁ
బయిపూఁత నత్తరుఁ బదిలపఱచు

గీ. పోఁక లాకులుఁ గుంకుమపూవుబరణి
యేలకులడబ్బి చలువమిర్యాలపెట్టె
చుట్టు సేవింపఁ జిలుకలుచుట్టి పసిఁడి
పళ్లెరమునందుఁ దక్కుసంభార మునుచు. 62

సీ. హరిదంతములఁ గాయు నచ్చవెన్నెల నేలు
చిఱునవ్వు ముఖసీమ మురువుసూప
మొలకచీఁకటిమూఁక నలుదిక్కులకుఁ జల్లు
నెఱిక్రొన్నెఱులకాంతి నీటుగులుక
నీరెండ గాయు బంగారుకుండలఁ గేరు
వక్షోజములకాంతి పరిఢవిల్లఁ
బల్లవమ్ములకాంతిఁ గొల్లగొట్టఁగఁజాలు
పదయుగమ్ములశోభ ప్రిదులుకొనఁగ
గీ. మేలుమేలిమి చందాన మేను మెఱయ
నీటుగా దిద్దుకొనుచుండి పైఁటచెఱఁగు
నడుగునడుగున నొయ్యార మతిశయింప
వచ్చి నిలుచుండు నాబాల వాని మ్రోల. 63

చ. కరములఁ గంకణక్వణము ఘల్ఘలుఘల్ఘలుఘల్లురంచనన్
జరణములందు నందియలు ఝల్ఝలఝాలఝలంఝళీఝళ
స్వరముల నీన వేణిఁ బ్రసవంబులు ఘుంఘుముఘుమ్మనంగ సుం
దరియరుదెంచురాము తనుదండముఝల్ఝలుఝల్లనుంచనన్.

వ. అట్టు లన్యోన్యప్రేమకల్లోలినీకల్లోలమాలికాఘోలికాజాలంబుల నూయలలూఁగుచుఁ బరదేశావలోకన కౌతూహలాయత్తచిత్తులై కొండొక ముహూర్తంబున బయలుదేరి యరిగి తిరిగి తనుతర కాలంబునకుఁ దిరిగివచ్చి రంతఁ గొంతవడికి రాముఁడు వేశ్యా

లోలుఁడయ్యెనని కొందఱును కాదుకాదు వైష్ణవుతోడి మైత్రి కతంబున నాతఁడా త్రోవున కేగుచుండు నని కొందఱును రాముఁడే వేశ్యాలోలుండైన నింక లోకంబున సామాన్య మానవులసంగతిఁ దడవం బనిలేదనువారు కొందఱును వాని నెత్తిమీఁద నెగిఱిపోయినవారే కాలవంచితులై స్త్రీలోలురై రింక వాని లెక్కయేమి కాలము విచిత్రము దుస్తరమునుగదా యనువారు కొందఱును గాదనువారుకొందఱును వెట్టిమాట 65

సీ. లికుచపదంబులోని కుచోక్తిఁ దలఁచి యా
పదము పల్కఁగ భయంపడెడువారు
'శ్రీకుచోపరి' దీసి 'శ్రీభుజోపరి' చేసి
'యమ్మయ్య బ్రతికితి' మనెడువారు
మాటంపుఁజను లన్నమాట వచ్చినచోటఁ
బువుగుర్తులను బెట్టి పోదలువారు
వక్షోజమనుచోట వక్షోజమను నర్థ
మునె చెప్పి తప్పించుకొనెడివారు
గీ. "పడఁతి రతి"పదములు వినంబడినతోడ
హరిహరీయని చెవి మూసి యడలువారు
తమము లందందుఁ బర్వెడి తడవుగాఁగఁ
బడఁతిమాటమి కల్లాడువారుగారె. 66

వ. అని మఱికొందరును పలువురు పలుపలువిధములఁ జెప్పఁగొన సాగిరి. తద్వర్తనంబునకు హానిమిత్రసత్తముండొకఁడు డెందంబునఁ గొందలమంది యా సుందరిపొందున కెడ గలిగింపఁ బ్రయత్న పరంపర లొనర్చి విఫలమనోరథుండై రామునకుఁ బ్రత్యక్షం బుగా నీతి గఱపనెంచి యొకానొకనాఁ డాతనిం జేరంజేరి 67

ఉ. చిన్నిప్రాయమునందె బల్వన్నె కెక్కి
రామ! సుగుణమణిగణాభిరామ! విమల
రమ్యకవితాభిరామ! యోరాఁ! యనంగ
యశముగాంచితి వది యెల్ల వ్యర్థమయ్యె. 68

గీ. అర్థుఁడ వెల్లవారికి సముంచితబోధ మొనర్ప నిప్పుడో
గర్హితమయ్యె నీ చరిత కానను క్రిందునుమీఁదుఁగూడ నీ
కర్థమె యిట్టిచొప్పు విమలాన్వయసంభవ తుచ్ఛవేశ్యకై
నిర్థరణం బొనర్చితివి నిర్మలకీర్తి ని కేమిచెప్పుదున్ 69

గీ. ఎల్లవారికి శకునంబులెల్లఁ బలికి
బల్లి తాఁ బోయి కుడితిలోఁ బడినభంగి
నెల్లవారికి సద్బోధలెల్లఁ గఱపి
యగునె బోరగిల్లఁగ స్వకార్యంబులందు. 70

ఉ. సారపుభూములుండియును శాస్త్రములన్నియుఁ దల్లక్రిందుగా
నేరిచియుండియున్ నిధులనేతగ నుండియు సర్వధారుణీ
భారవిరాజితంబయిన పాలన ముండియుఁ జిల్లిగవ్వకున్
మారగనేర్చునే గుణము మంచిదిగానిమనుష్యుఁడెందునున్. 71

చ. ఒకసణితోడితృప్తి గనకుండిన సిష్టమువచ్చినంతమం
ది కులలతాంగనామణుల ధీరతఁ బెండిలియాడరాదె నా
టకములునర్మవాక్యములుటక్కులునున్నయగారముల్ భ్రమల్
కొకిబికిభావముల్ గలుగు క్రూరల వేశ్యలఁ గూడనేటికిన్. 72

శా. మాన్యక్షేత్రములమ్మఁజేయుగృహమోమాకందపుందోఁటలో
యన్యాక్రాంత మొనర్పఁజేయు నగ లేకాపోశనంబెత్తుఁ గ
ట్టా!న్యాయాధ్వవిదూరుఁ జేయు నలవేశ్యాసంగమం బీ వసా
మాన్యప్రజ్ఞదలిర్ప దాని విడుమా!మామాట మన్నింపుమా! 73

చ. ధనసతు లర్థకాంక్షు మదిఁదాల్చి వికావికనవ్వుచుంద్రు రో
దన మొనరింతురొక్కపుడు తారు బొజుంగుల నమ్మఁజేసి వా
రినిఁ గలనైన నమ్మ రరరే! కులశీలముగల్గువారి క
న్యనితలు వల్లకాటిసుమపంక్తుల వైఖరిఁ ద్యాజ్యలేకదా! 74

వ. వెండియుధనోన్నతిఁ గన్న వార లేకదా సర్వగౌరవసంపన్నిలయులు

గీ. ప్రాణము వివేకమును లేక పరఁగు వట్టి
భేరి 'ధనధన'మ్మని గోలపెట్టుచుండఁ
బ్రాణము వివేకమును గల్గి ప్రబలు నరుఁడు
ధనము నిర్లక్ష్యమునుజేయఁదగునె సఖుఁడ! 76

వ. రామా! ప్రాజ్ఞుండవైననీకు మేము సెప్పవలయునే! అన్నియు లోకంబునఁ జూచుచున్నవాఁడ వింతకు నాసుందరి నీకు శాశ్వతంబె యని యింకను హితోపదేశంబుచేయు నా హితుని వాక్చమత్కృతులఁ బరిహసితునిఁ జేసి 'తెలియనివానికిం జెప్పినట్లు చెప్పెద వేనంతయెఱుంగనివాఁడనే? దాని గుణంబు లీ వెఱుంగనివాఁడవగుట నట్లనియెద వని వానిహితంబు నొక్కొకటి ప్రతిహతంబుసేయనెంచి. 77

చ. తలఁపదు లాఁతిమానిసిని దైవమునందు ద్విజౌఘమందును
మెలఁగును భక్తితో మనసు మెత్తన వర్తన గీర్తనీయము
బలుక దసత్యవాక్యములు పల్కఁగనేటికి మేరయున్న యఁ
వ్వెలచెలి సద్గుణమ్ములకు వేశ్యలలో నది తప్పఁబుట్టెరా! 78

గీ॥ వేలకునువేలు సఖియ లేవేళ బాఁచ
నిచ్చినఁ దుదిఁ బువ్వులఁ బెట్టియిచ్చు 'నెంత
మంచిదిర' యంచు జనము మన్నించుదాని
సుందరినిఁబోలు వేశ్య లింకెందుఁ గలరు 79

గీ॥ పొడవునుంగాదు పదపడి పొట్టిగాదు
లావునుంగాదు మరియుఁ బీలయునుగాదు
సాటివెల్లాటకత్తెల సవతులేక
కొమ్మలం దొప్పు నది పైఁడిబొమ్మయగుచు. 80

కం॥ జడపొడవును నడబెడఁగును
దడఁబడు నెన్నడుముసొగసు దరహాసంబున్
నుడిపొక్కిలి నుడితీపియుఁ
బొడసూపునె వేల్పుపూవుఁబోఁడులయందున్. 81

గీ. పడఁతి కీల్జడ భుజఁగుల భయముపెట్టుఁ
గురులు నెఱిమించు మోహ వాగురుల పట్టు
ఇంచురసమును విస మనిపించు మోవి
మెఱుపుఁదీవను హసియించు మేనితీవి. 82

వ. అని వచించుచుండ నాహితాగ్రగణ్యుండు 'వెఱ్ఱిరామా! నీమాట
కడ్డువచ్చెద. 83

సీ. ముస్తాబుమఱుఁగున ముదిలంజయును గూడఁ
బినవాసిపించెదై పెంపుఁగాంచు
విడియమ్ము మాటునఁబడి తుట్టపెదవియు
నరుణాధరము మాడ్కి నతిశయిల్లు
సవరాలజతగూడి సరిలేని చిఱునెఱుల్
కటిదాఁటుజడయౌచు నటనసేయు
జాతిపూఁతలమాటు కోఁతిమోమునుగూడఁ
బున్నమచందురుఁడై వన్నెగులుకు
గీ॥ తళుకుతళుకను కాంతిమాత్రంబుచేతఁ
బసిమిబంగారుముద్దంచు భ్రాంతిపడకు

సంతమెఱుఁగు సానిమెఱుఁ గత్యంతకృత్రి
మాకృతులనుట వినవె విద్యాప్రవీణ. 84

వ. అని పలికిన రాముండు వాని పలుకు లాలకించి పక్కునసవ్వి 85

గీ. వంపుటొంపునులేని నావర్తనంబు
సఁదు నలుసంత నలుపిప్పు డావహిల్లె
నెప్పు డేకాలమున కేమొ యెవరికెఱుక
గడచిబ్రతికితిమని గంతులిడఁగరాదు. 86

వ. ఓయీ వెండియు దాని రూపరేఖావిలాసంబులంగూర్చి విన్నవాఁ
డవేకాని కన్నవాఁడవుకావు. అదియట్లుండ నాసుందరి గొనముల
ప్రోవనిన నతిశయోక్తి కాఁజాలదుగదా. 87

గీ. దేవతాబృందమందు భూదేవులందు
భయము భక్తి గలుగు నొకవ్యక్తిఁజేసి
వైశ్య యనఁబోయి ముదిబ్రహ్మ వేశ్యయనియెఁ
గాకయుండినఁ దద్గుణానీకమున్నె. 88

వ. అదియట్లుండనిమ్ము. 89

కం పూవులుముడిచినదే సతి
యావుల మఱలించువాఁడె యర్జునుఁడు సఖా!
భావింపఁగ వేశ్యాంగన
సావాసము గలుగువాఁడె సత్కవిజగతిన్. 90

కం. ఆనాటికిఁ బెనుప్రాపగు
నానాఁడే విడుచునంచు ననియెద వోఁగా
నేనై మోసముసేయను
పోసిరా కట్టెవంక ప్రొయ్యే తీర్చున్. 91

కం. చెలువుండిన గుణముండదు
చెలువుండదు గుణమె యున్నఁ జెలువుగొనంబుల్
వెలయునుగద సుందరియెడఁ
గుల మొక్కటె లోటుగాని కోవిదచంద్రా! 92

ఉ. చెల్లరె! జ్ఞప్తివచ్చె వెలచేడియ లొక్కకొలంబువారలే
తల్లిని బ్రాహ్మణుండొకఁడు దగ్గరఁ దీసెనటంచుఁ జెప్పగాఁ
దొల్లి వినంగనయ్యె వెలతొయ్యలి యేకులజైన వరించునో
యల్లది యా కులంబునదె యంచల పెద్దలుతీర్పుచెప్పరే! 93

వ. అదియుంగాక 94

గీ. అమృతము హాలాహలంబునం దణఁగియున్న
నీచమనుజునికడ విద్య నెగడుచున్న
హీనకులమున స్త్రీరత్న మెసఁగుచున్నఁ
దప్పక గ్రహింపుమనెడు శాస్త్రంబు వినవె 95

వ. వెండియు 96

చ. కులసతిపొందులో నొనరఁగూడవుసు మ్ముఖలేప్సితంబు ల
న్యలలనపొందు కొంతసుఖమన్న ఋణానుభవం బసహ్యమాఁ
గులటలపొం దనన్య రతికోవిద సర్వసుఖప్రదాత్రియా
వెలసతిపొందెపొందు పదివేలును లక్షయుఁ గోటి సేయఁగన్.

వ. వేయేల? దైవయోగంబునుంగూడఁగలదు. మిత్రమా! అదియొక్క టెయేకాదు. ఇంకొక్కటెయునుంగూడఁ గలదు. అందెవ్వతెను వీడుమందువు. 98

ఉ. ఒక్కతె కట్టుకొన్నది మఱొక్కతె నే వలవంగఁ వచ్చె నిం
కొక్కతె తాఁ దనంత వలపు నను సద్గుణరాశిఁజూచి యా

చక్కనిచుక్కలందుఁ గడసారిది నారతనాలమూట బల్
క్రక్కసమౌను ముంజెవులకన్నను వెన్కటికొమ్ము లారయన్ 99

గీ. 'అసలె' నోరువాయి యెఱుఁగ దాదిసాధ్వి
వలచి వలపించి తక్కినవార లిర్వు
రుత్తమార్థంబు సమకూర్పకున్న మివులఁ
గష్ట మిఁకుదురు గయ్యాళిగంప లౌర! 100

వ. అని నచియించు రాముని వ్యంగ్యవచనామృతనిచయంబున కబ్బురమంది 'రామా! ఇంకొక్క తెకూడఁగలదని చమత్కరించి తివి. నీభావంబు నే గ్రహించితి. వేటొండులతాంగి ముఖంబుఁ జూతునని చెప్పి నీ వెంత నన్ను నమ్మింపఁ జూచినను నే నమ్మ వాఁడఁనుగాను. ఇంతధీమంతుండ విట్లు గణికాలంపటుండ వైనందుల కెంతయు వంతంగూరుదు సింతకును నిన్ననవలసినపని యేమున్నది. సహజకవితాసామ్రాజ్య చక్రవర్తులకున్న ప్రారబ్ధమే యిది యని భావింతు నని పలికి బోధించి విఫలమనోరథుండై యాహితుండూరకుండె. 101

చ. తొలఁగు సమస్తసంపదలుఁ దూలుఁ జిరార్జితకీర్తి యంచు నీ
తులు గఱపంగఁజూచెదు హితుం గని మాట తొలంగనీక తా
బలితపుయుక్తులం గొలిపి పల్కఁగనీయఁ డతండు బాపురే!
తెలిసినయట్టిమూర్ఖునకుఁ జెల్ప వశంబె విధాతకేనియున్. 102

వ. ఇట్లుండ నిక్కడ సుందరితల్లి యాసుగుణగణాభిరాముని రాముని స్నేహంబున కమందానందంబునొందియు సుందరి రాముఁ డిచ్చిన దానితోఁ దృప్తినొందుచు ధనార్జనంబుచేయకుండుటఁ గాంచి కూఁతునకుఁ బ్రబోధంబు సేయనెంచి సుందరిని దరికిం జేరికించి దాగ్రహావలోకనంబులఁ బ్రసరింపఁ జేయుచు. 103

గీ. రాముఁ డగపడు టే చాలు మోముసకు
'వీరభద్రపళ్ళెరమంత' వెలయుఁగాదె
పెత్తనంబెల్ల నాతని నెత్తిఁబెట్టి
గొప్ప గొటిగించుకొందువే కుట్టిముండ! 104

కం. కులవృత్తినిఁ దలపోయవు
తలపోయవు ధనముమాట దారిద్ర్యముతోఁ
దులఁదూఁగుచున్నవారము
తొలఁగునె యిది మారుతోడ్పొ లేక యున్నన్. 105

చ. కడుపుఫలింపకుంటఁ బరఁగన్ గుడిచేతిని మీఁదుగట్టి నే
నెడమకరంపుభోజనమునే పదియేం డ్లొనరించి యెవ్వరే
నడుగ భుజించుకాలమున నాదిన మోదన మంటకుండ నె
క్కుడు కడగండ్లపాలగుచుఁ గూఁతుర! సిన్నసి పెంచితింగదే!106

వ. మనకులస్త్రీలను జూచిన నెంతముద్దగుచున్నది. 107

ఉ. కుందనమందుఁ దేలుఁగద కుంజరి మొన్నటి దాత్రివేణి మే
ల్మందిర మొందుగట్టె నిళ మాన్యము లెన్ని గడించిపోసె వీ
రందఱు నిన్నుఁబోలుదురె యందమునం దల రాముఁగూడి నీ
వెందునుబొందకుండ నిటు లెద్దడిఁజెందెద వెంతపాపమే! 108

గీ. వినవుగా యెంత చెప్పిన వెఱ్ఱిపిల్ల
యింతచిన్నతనమునందె యిట్టిగుణము
పట్టువడె నేని సంసార మెట్టులేఁది
కడచి గట్టెక్కఁగలవొ యికాఁలమందు. 109

చ. పొలములమీఁది 'సిస్తు'నకుఁబోయి 'వసూ'లొనరించి వేయిరూ
కలుగలసంచి నీ కొసఁగెఁగాదొకొ భద్రి మటంచుఁ బైసయున్

దలఁపవు తీయఁగాఁ 'జెలివితక్కువపెద్దమ!' చేతి కందిన
ప్పుడ యెగఁగొట్టఁగావలదె ముందరిమూ పది లేదెసుందరీ! 110

గీ. నూక లగపడుటేచా లనూసగతిసిఁ
జీమ గ్రిక్కునఁ గలుగునఁ జేర్చుకరణి
రూక లగపడుటేచాలు రోవెలంది
పెట్టె నెట్టన జాగ్రత్త పెట్టవలదె. 111

గీ. కాని గడియింపవలెనన్నఁ గానిగడ్డి
గఱవవలెఁగాదె యోచేతగానిమొగమ!
వయసు మళ్లినతఱి నొంటిపైసయైనఁ
నార్జనముఁజేయ నీతరమౌనె చెపుము! 112

గీ. ఎందఱెందరో నృపచంద్రు లేగుదేర
నెగ్గొనర్తువు కనవు కన్నెత్తియైన
దనకుఁ దానొచ్చు వచ్చి పాదముల సిరియ
పడిన వలదని తన్ను నిర్భాగ్య కలదె. 113

వ. మగఁడు మగఁడనియేడ్చెదవు మనకొక మగఁడున్నమాటయేమి?
అదియుంగాక. 114

గీ. తాలిగట్టినమగలనే తఱిమికొట్టు
సతుల నెందఱెందఱఁ దొరసానులందుఁ
గడకు సంసారు లందున కనమె యిట్లు
నీనుదుటన పొద్దువాడిచెనే కుమారి! 115

వ. పోనీ యెన్నటికైన నా రాముని కనుగ్రహము గల్గి మనయిల్లు
బంగారుసేయు ననుకొందమన్న వాని యీవిమాటఁ జెప్పనక్కఱ
యే లేదుకదా! 116

ఆ.వె. ఏన్గు పడినయప్పు డెనుపోతు పడినప్పు
డింతయైనఁ బాపు లెఱుఁగఁడౌర!
దోమ పడినయపుడు తోడఁ బాపె నన్నట్లు
వెలయుఁగాదె వాని వితరణంబు. 117

వ. అని యింకను నేమేమియో బోధించు తల్లిని నోరెత్తవలదని
వారించియు నుల్లకుట్టుమాట లాడియు. 118

ఉ. రాముఁ డుదారమానసుఁడు రాజితధర్మపథప్రవర్తి న
న్నోముచుఁ జూచుచుండడె నిజోత్పలనేత్రవిధాన సూనృతో
ద్దాముఁడు సద్గుణాకరుఁడు తల్లిరో! వానిని వీడుమందు వే
మోమిడిచేతు నట్టు లిహాముం బర ముందునె యిట్టిజాతికిన్. 119

గీ. గవ్వవిలువ లేని నను దగ్గరకుఁ దీసి
రాముఁ డెక్కించెఁగాదె గౌరవపదంబు
పూల రువ్వినవారిని ఱాల రువ్వ
నెవ్వరే విన్నవారలు నవ్విపోరె! 120

చ. విలువయు లేని సున్న కటు వెన్కగ నంకె లిఖింప నెంతయో
విలువ ఘటిల్లుచందమున విల్వ రవంతయు లేని నాకు న
య్యలఘుగుణాఢ్యుఁ డండ యయినంతనె యింతయునంతనంగరా
ని లలితగౌరవం బొదవె నేను కృతఘ్నతఁ జూపనేర్తునే 121

గీ. ఇల నిశాప్రభృతుల మేలుకలిమిఁ గాంచి
మనకు లేదంచు నేడ్వ సమ్మతమె తల్లి!
తనకు లేదన్నఁ బోవు నేత్ర మ్మొకండు
నొరులసంపద కేడ్చిన నూడు రెండు. 122

గీ. అతఁడు చేపట్ట రెపరెపలాడుచుంటి
మిట్టిదుర్బుద్ధి తల్లిరో పుట్టనేల

చెట్టు చెడుకాలమునకునుఁ బుట్టుఁ గుక్క-
మూతిపిందె లనెడున్యాయమునను నీకు. 123

గీ. ఎంత యార్జించినను వేశ్యకాంత చచ్చు
నరికి గవ్వ నిల్వదనెడు సామ్య మదిర!
యెంత యెదిగిన బలిసిన నెంతయేని
తోడఁదిగొఱ్ఱెకుబెత్తెఁడే తోఁకగాదె! 124

చ. చటులమధువ్రతప్రకరఝుంకృతి మంత్రము సూర్యచంద్రులే
పటుతరసాక్షు లించువిలు పట్టినవాఁడు పురోహితుండుగాఁ
దటుకునఁ బట్టె నాకర ముదారచరిత్రుఁడు రాముఁడాతఁడుక్
విటుఁడనుగాఁడు నేను మఱి వీఁడియుంపుడుఁగత్తెఁ గానిఁకన్.

గీ. అద్వితీయపువలపు దా నలముకొనఁగ
నను ద్వితీయగా గ్రహియించినాఁ డతండు
నాథుఁడెయటంచు నతని నే నమ్మెదెల్ల
కాలమును మనోవాక్కాయకర్మములను. 126

కం. పడిగ్రద్దలఁ దిను రాబం
దు దుదకుఁ బెనుగాలిపెట్టుతోఁ బొలియుగతిక్
బదిమంది దిబ్బచేసినఁ
దుద కది సరిగాదె యొక్కదోఁపిడితోడన్. 127

గీ. న్యాయవృత్తి నార్జించు ధనంబె వృద్ధి
నెసఁగి నిలఁబడి చక్కగా నిముడుఁ గాని
చెడదె యన్యాయవృత్తి నార్జించు ధనము
గడ్డి తిన్నను నిండునే కడుపు తల్లి! 128

వ. వెండియుఁ గాలపరిస్థితులన్నైన గమనింపనైతివికదా! 129

ఉ. మానరె మేళతాళములు మానరె మీ కులవృత్తి మీ స్థితిన్
మానసమందు నెంచిన నమాంతముగా హృది వ్రిక్కలౌనటం
చా నరవేషధారుఁడు మహాత్ముఁడు నిచ్చ లుపన్యసింప న
మ్మాన నయదూరవై నిరయమార్గముఁ జూపెద వెంత వెఱ్ఱివే 130

ఉ. మానము నమ్ముకొంచు నభిమానముఁ బూర్తిగఁ జంపుకొంచునీ
మానవుఁడంచు నేనుమనుమాటయ లేక యశాశ్వతార్థమం
దూని దురాశ దుష్కృతసముత్కరముం బొనరించి మానమున్
జేనెఁడుపొట్టకై నుఱుముసేయుటకంటెను జావు మేలగున్. 131

ఉ. ఇచ్చిన నీయకున్న నిఁక నెంతగ నీవును గోసిపెట్టినన్
బుచ్చెదఁ గాల మా సుగుణమూర్తినె కూడి చరించుచుండి యా
సచ్చరితుండె నన్విడువఁజాలిన దైవముతోడుసుమ్ము నేఁ
జచ్చెదఁగాని వేఱొకని సంగతికిన్ మన సొగ్గనేర్తునే? 132

వ. అని నానాప్రకారంబులఁ బూర్వకాలపుఁదల్లికి బోధించి యించు
కేనియు వంపుటొంపు లేనివర్తనంబున నాసుందరి ప్రవర్తించు
చుండె. విరజాపురంబునకు లీలాపురంబు పంచాశత్క్రోశంబుల
దూరంబునం గలదు. అందు సుందరికి నీలవేణి రాజ్యవల్లి యను
నిరువురు సోదరీమణులు గలరు. వారు కులవృత్తియం దండె వేసిన
చేయినా సంచరించుచుండిరి. తీరికవేళల సుందరీరాము లానంద
తుందిలహృదయారవిందులై లీలాపురక్రీడాలోలురై పోయి
సుందరి సోదరీమణుల మందిరమ్ములఁ కేగి మగిడి వచ్చుచుండెడి
వారు. తత్సోదరీమణుల ప్రవర్తనంబునకు భిన్నంబుగానున్న
సుందరీవర్తనంబునుగాంచి రాముఁ డానందాశ్చర్యానుమానం
బులు ముప్పిరి గొన మెలంగుచుండి యప్పుడప్పుడు సందిగ్ధమాన
సుండు నసందిగ్ధమానసుండునగుచు నిట్లు తలపోయుచుండు. 133

చ. పొడమరె యొక్కవంశమున ముగ్గురు నక్కట యొక్కతల్లికే
పొడమరె బుద్ధు లొక్కమెయిఁ బోల్చునుగాదొకొ భేదమేదియేఁ
బొడమిన ముల్లువాసియగుఁ బూర్ణవిభేదము గల్గుటెట్టు లె
వ్వెడలను "కుమ్మరావమున నిత్తడిముంతల నెత్తవచ్చునే" 134

గీ. మలయుదురు చెడ్డకులమందు మంచివారు
చెలఁగుదురు మంచికులమందుఁ జెడ్డవారు
కర్దమమ్మునఁ బుట్టదే కమలచయము
పాలవెల్లినిఁ బుట్టదే హాలహాలము. 135

వ. అప్పటప్పటఁ గోడెగాం డ్రావీథింబోవుట రాముండు గాంచి
యనుమానపరుండై యుండువాఁడు. 136

సీ. ఎదురైన నెవరైన సుదతికోసమె యంచు
నెంచి ప్రక్కకు జాఱి పొంచిచూచు
నుత్సవంబును లోచనోత్సవంబుగఁ దొంగి
చూచినఁ దప్పుగాఁ జూచు నెదను
ఆవీథిపనిమీఁద నన్యు లేగినఁ గాంచి
సందర్భ మేమంచు సంశయించు
ద్వార మోరఁగ మూయఁబడి యున్నచో లోన
నుండి రెవ్వరో యంచు మండిపడును
గీ. సంశయంపడుఁ గాంత ముస్తాబైన
హాళి ముస్తాబు కాకున్న నాగ్రహించుఁ
దాను తననీడనుం ద్రొక్కి దద్దరిల్లు
బాధలకుసంస్థ! యనుమానపరు నవస్థ! 137

గీ. సకలజననయనానంద సస్యలక్ష్మి
చలికి నవయవంబులనెల్ల ముడుచుకొనుచుఁ

బండుకొనెనన( జేల( గుప్పలు పడంగ(
బుండువంటి హేమంతంబు వొడమెనంత. 138

శా. నిద్రాముద్రితమై యెసంగె జలజానీకంబు పెన్మంచుచే
నదిశ్రేణులు గప్పఁగాఁబడి హిమాహార్యంబులై యొప్పె ఘ
స్రద్రాఘిష్ఠత హ్రస్వమయ్యెఁ దుహినాంచద్వాతసంజాతకం
పోద్రేకంబున నబ్జజాండ ముహుహూహూహూకృతిఁ జేప్పడెన్.

సీ. ఎలనాఁగ నెమ్మోముఁ దిలకించుటేకాని
తిలకింపఁబోవ రక్కలువ తేని
నెలఁత నవ్వులఁజొక్కి నిద్రించుటేకాని
నిద్రింపఁబోరు వెన్నెలలయందు
ధవళాక్షి యధరామృతం బానుటేకాని
యానఁబోవరు తటాకామృతంబు
అతివ కుచాద్రుల నంటియుండుటెకాని
యంటనొల్లరు హిమాహార్యములను
గీ. కొమ్మ నిట్టూర్పుగాలి తాఁకుటయకాని
తాఁకనీయరు తాళవృంతముల గాలి
భూరిభోగప్రియత నొప్పుపూరుషులు ని
తాంతదుర్దాంతమైన హేమంతమందు. 140

వ. అట్టి హేమంతంబున సుందరీ గాఢాశ్లేషపరంపరాబద్ధుండై చలి
దయ్యంబును శంకరగిరి మన్యంబులఁబట్టించు రామునకు 141

గీ. గొప్పరాచకార్యంబు 'హైకోర్టు'నందుఁ
బరఁగె రమ్మంచు నొక 'తంతి' వచ్చిచేరె
సుందరీదత్తసౌఖ్యంబుఁ జూడఁజూడఁ
గొసకు దైవంబునకును కన్నుగుటెననఁగ. 142

కం. నిలువుననీరై పోయిరి
జలజాతేక్షణయు రామచంద్రుండును దాఁ
దలపోయనొకటి దైవము
తలపోయు మఱొండు ననుట తథ్యంబయ్యెన్. 143

ఉ. దీనవిలోకనావళులఁ జేటి కనుంగొని రామచంద్రునిన్
నేనును వత్తు నొంటరిగ నిల్వఁగనేరను బ్రాణనాయకా!
నా నుడి గౌరవింపుమని నాతి కనుంగవ నీరునించెఁబో
ప్రాణసమానుఁడైనప్రియుఁ బాయుట కష్టముగాదె బోంట్లకున్.

చ. జొటజొటబాష్పబిందువులు జొబ్బిల మౌక్తికబృందముల్ వలెన్
బటమున నొత్తి కన్నుగవ వారమునాటికి వత్తునంచు న
క్కుటిలవినీలకుంతలను గోవిదచంద్రుఁడు కుస్తరించుచున్
దటుకున ముద్దుఁబెట్టుకొని తా నిలు జాగ్రతయంచునున్ జనెన్

వ. వెళ్లినమఱునాఁడే కార్యసంసిద్ధికా నతఁడు వెంటనే యింటి
ముఖంబై. 146

కం. 'ఢిల్లియక్స్ప్రెసు'పై ను
ద్యల్లీలాభూరిలాలసామలహృదయో
త్ఫుల్లాంభోజుండై నిశి
కల్లల్లన వచ్చి వ్రాలె నన్నగరమునన్. 147

కం. సుందరినిన్ శోధన సే
యం దనకుఁ గుతూహల ముదయము కాఁగన్ దా
నందునఁ జని జాలాంతర
మందుంగలసందుసందు నాలోకించెన్. 148

మ. అసితాభల్ వెదచల్లుదుప్పటముఁ దామూపాదమస్తంబు మేల్
ముసుఁగుందన్ని పదుండ నత్తరుణి నెమ్మోమందునన్ దాను బెం

పెసలారఁ దన మోమువెట్టి వలకే లెంతే వలగ్నంబుపై
నెసఁగంజేసి పరున్నపూరుషునిఁ దా నీక్షించి సక్రోధుఁడై. 149

చ. తలపయినొప్పు నమ్ముసుఁగు దాఁటియు మంచముపట్టెమీఁదికిన్
వెలువడి యించుకించుకయ వెల్గెడు వ్రేలిహొరంగుటుంగరం
బులు గని కోమలత్వమును బొల్పును లేసి కరాంగుళుల్ మహో
త్పలదళనేత్ర వెట్టులగుఁ దప్పక పూరుషు వ్రేళులం చొగిన్. 150

కం. నిశ్చయముచేసి 'విప్రాః
పశ్చిమబుద్ధయ' యని మును పలుకరె పిదపన్
బశ్చాత్తాపం బేలసి
యాశ్చర్యాలోచనముల నట గడెనిలిచెన్. 151

కం. అరసి యనామిక మచ్చయుఁ
గరమున బొటవేల్రు లేమిం గని వ్రేళుల యుం
గరముల గుఱుతులు గని కని
కరమును గొనఁ బనివలదని గడుఁగ్రుద్ధుండై. 152

కం. ధన మొసఁగిన మన మొసఁగిన
ననుఁగుం బ్రాణ మొసంగినను ననువగునెడలన్
జనరే పెడత్రోవల ఛీ
ధనకాంతల నమ్మనగునె ధాతకునైనన్. 153

వ. అని విచారించి రాముండు తటాలున నిజమందిరంబునకుం జని యక్కాంతయందు నిస్పృహత్వంబు నొందియుండె నాసుందరియు వారముదినము లతిక్రమించినవెనుక రాముం డింకను రాకుండుటకుఁ జింతించి యూరినుండివచ్చియుఁ దనయింటికి రాకుండుట కేమిహేతువోయని యాలోచనచేసె కారణం బరయఁజాలక 'కబురుపైఁగబురంపి' యంతకును రాకుండ ప్రత్యు

త్తరంబైన నీకుండిన నిక్కమ్మగువలపు గ్రమ్మ నక్కొమ్మ
యొక్కకమ్మ నిట్లులిఖించి రాముని సమ్ముఖమ్మునకుఁ బంచె.

ఉ. శ్రీమదఖండవైభవవిశేష! విశేషమనీష! సత్కవి
త్వామలవాగ్విభూష! కుసుమాయుధవేష! యశేషసజ్జన
స్తోమనుతిప్రభూష! యిదె సుందరి మీపదపంకజంబులన్
బ్రేమ దలిర్ప వ్రాలి నయవిస్తృతి మీఱఁగ వ్రాయుసంగతుల్.

ఉ. తిన్నగ నీగృహంబె పొలఁతీ కన వచ్చెదనంచు సత్సుధా
సన్నవచఃప్రసంగముల సల్పితి వారముక్రిందవచ్చి యీ
తెన్నను ద్రొక్కకుంట యది తీరె యసత్యము లాడనౌనె వి
ద్వన్నుత! యాను మీకు నది పాయక పెట్టిన దుగ్గుఁ బాలతోన్.

వ. ఎట్లందురేని. 157

గీ. చెప్పుదురు 'పుక్కిటిపురాణ' మప్పుడపుడు
విప్పుదురు వియత్పంచాంగవిసరములను
కప్పుదురు చిత్రచిత్రంపుఁగల్పనములు
కవులవాక్యోచ్చయము లలీకములుగావె. 158

ఉ. పాపము! చుట్టలింక నిలుఁ బాయరో? మించిన రాచకార్యపు
న్మోపున సుంతయున్ గలుగఁబోవదొ తీరిక జాయతోడి స
ల్లాపపరంపరైకవిధులం బడి నన్నటు విస్మరించితో
యేపనియైన నాకుఁబనియేమిఁక మిమ్ములఁ బృచ్ఛసేయఁగన్.

భవత్పదదాసి,

సుందరి.

వ. ఆలేఖ నామూలాగ్రంబుగాఁ జదివి యదియంతయుఁ గపట
మ్మగా మనమ్మునఁ దలంచి ప్రత్యుత్తరం బిచ్చుటకైన నిచ్చ
గింపక యక్కచెలియాండ్ర వృత్తంబులఁ జక్కగా నీక్షించిన

వాఁడుగాన రాముఁడు తజ్జాతిఁయున్నను దద్వృత్తియన్నను
నేహ్యమ్ముగాఁ బరిగణించి యిట్లు స్వాత్మప్రబోధంబునకుఁ
గడంగె. 160

చ. వెలజవరాండ్రయిండులకు వెళ్ళెడువారల పాటులన్నిఁటిం
దెలిపెదఁ దేటతెల్లముగ దీని గ్రహించుచు నింకనైన వి
చ్చలవిడి సంచరింపక ప్రసన్నతనొంది జగంబులోనఁ బె
ద్దలకును బెద్దవై యశముఁ దద్దయుఁ గాంచుము వెఱ్ఱిచిత్తమా!

చ. అలవు ఘటించి సిద్ధయత నచ్చపు మోవిని నుగ్గొనర్చి దే
హలతిక సాగఁదీసి సొబగంతయుఁ గూల్చెడు నడ్డమైనవా
రల కవకాశమిచ్చు వెలరామలఁ బొందుచుఁ బాలవంటి స
త్కులమునురూపముఁ ధనముగూలఁగఁద్రోయకు వెఱ్ఱిచిత్తమా!

ఉ. వస్తువుచేసియిచ్చెననువంకను బోవును కొమ్మకానితో
దుస్తులుగుట్టెనం చరుగుఁ దోరపువేడుక 'దర్జి'వానితో
నేస్తము గూర్చెనం చరుగు నేర్పు ఘటిల్లఁగఁ దార్పుకానితో
వాస్తవరాగ ముండునొకొ వారవధూటికి వెఱ్ఱిచిత్తమా! 163

చ. అడుగిడుతోడనే తెలిసి యల్లన వస్తువులెల్లనూడ్చి య
ప్పుడ మసిపాత గట్టి మరి పుల్కునఁ గారెడు బాష్పధారతో
'బుడిబుడిదీర్ఘముల్' నెఱపి భోరునఁ దా విలపించు మించి య
ప్పడపువెలంది, సత్యమనవచ్చునె యావగ వెఱ్ఱిచిత్తమా! 164

చ. అరయఁగఁ 'బైపటారమయి యంతరమందు లొటారమై' నిరం
తరకపటాంతరంగమున దబ్బర కిల్లగు వేశ్యఁగూడి యొ
క్కరగడె తుచ్ఛభోగమున కారునెలల్ మఱి మంచమెక్కి దు
ర్భరమగువేదనం బడగఁ బాల్పడు నెవ్వఁడు వెఱ్ఱిచిత్తమా! 165

చ. కతికి గడించుడబ్బు కలకాలము నిల్చునె యెందు నట్లె శా
శ్వతముగ వేశ్యతోఁ జెలిమి సాగునె యెట్టిజనాళికైన నా
హుతవహుసాక్షిగాఁ గొనినయుగ్మలి యొక్కతె శాశ్వతమ్మనుస
మ్మతికతనప్రియాసనము పాత్రయశంబటు వెఱ్ఱిచిత్తమా! 166

చ. నిజమున కెంతొ దవ్వయి వినీతికి సూడయి మచ్చ కిమ్మనై
రుజలకుఁ దావలంబునగు రోఁచెలి ప్రేమ సమంబె యెందు బల్
నిజమయి నిష్కళంకమయి నిస్తులమౌ కులకాంత ప్రేమకున్
బ్రజ లిది గానలేక మరి భ్రాంతి వహింతురు వెఱ్ఱిచిత్తమా! 167

చ. బుడుతలభాగ్యముల్ దొలఁగఁబుచ్చు ఘటించునుబంధువైరమున్
వెడరుజ నిచ్చు బన్న మొదవించుఁ బటుత్వము నొంచు నవ్వఁబా
టిడు నరకానఁ ద్రోయు ధనబృందము నారుపు నష్టకష్టముల్
పడఁగ నొనర్చు నింక నటుపాదముఁబెట్టకు వెఱ్ఱిచిత్తమా! 168

ఉ. ప్రక్కఁబరుండిహావమునుభావమునున్ మెఱయంగఁబల్కుచున్
వక్కల నోటఁబెట్టి యటుపై సుధరాచిన లేతమూతులన్
జక్కఁగఁ జుట్టి చిల్కలను సారెకు నోటికొసంగి తాను పె
న్మక్కువ నోట నందుకొనుమాదిరి దబ్బర వెఱ్ఱిచిత్తమా! 169

ఉ. బొంకన నెట్టిదో యెఱుఁగఁబోవని సత్యపథానువర్తియున్
బొంకక యుండనేరఁ డొకపూఁటయునైనను జారవృత్తిలో
"అంకుకుబొంకుకుంగలదురా" విడఁగూడనిబాంధవం బిఁకా
పంకకుఁ బోకుమా! నరకవాసము సుమ్మది వెఱ్ఱిచిత్తమా! 170

కం. జిత్తులమారులు భోగపుఁ
దొత్తులు చలచిత్తలు బలుధూర్తలు పదనౌ
కత్తులబోనులు వారల
చిత్తంబులవిషము నాల్కచివరలఁ దీపుల్. 171

కం. అడకత్తెఱఁబోఁకనువలెఁ
గడకొత్తుచున్న వేశ్య "కడ కేమడిగ
క్టైడు దడిగక్టైడు" వేళనో
చెడుతోవలఁ ద్రొక్కుమాట సిద్ధముసుమ్మా! 172

ఆ.వె. ప్రాఁకులాడు మంచిప్రాపు దొఱకు దాఁక
ప్రాపు దొరకుతోడఁ బారద్రొబ్బు
నష్టగోషమీఁద నధివసించినయట్టి
పిల్లి తీరు లంజపిల్ల తీరు. 173

సీ. ఘనయశోంచితవంశకాననంబులు గాల్ప
నాటనెలఁతుక దావాగ్నికీల
పారంబులేని యైశ్వర్యాబ్ధు లింకింప
నాటచేడియ బడబానలంబు
బయలంటి మెఱయు సంపచ్ఛైలములఁ గూల్ప
భోగంపుఁజాన దంభోళిధార
ప్రజ్ఞాభ్రములు పటాపంచలుగా వింప
నర్థాంబుజాక్షి ఝంఝానిలంబు
గీ. మహితకీర్తి చంద్రికలను మచ్చుమాప
వారకామిని గాఢాంధకారపటలి
విషమునకు నైన విఱుగుడు వెలయుఁగాని
విఱుగుడనుమాటయే లేదు వేశ్యకెందు. 174

గీ. పూఁతమెఱుఁగులపసలు పూఁబోండ్లతనువు
లలరఁజేసియునోన లచ్చెలుల నుడులు
కులికి మోసపోకుము వెలకలికి మిన్న
నోసలు బట్టుఁడు తోఁడేలు నోరుగాఁడె 175

సీ. సిరి తొలంగుటెకాక చేరదు సేమంబు
రాదు యశంబు గౌరవము లేదు
ఉడిపోవుఁ బున్నెంబు కడు విపద్దశ గల్గుఁ
బాప మొదవుఁ బరపతి యడంగు
లాఘవం బబ్బును లాఁతివారలలోన
నగుఁబాటు నెగతాళి యగును బిరుదు
రుజలు సంభవమౌను నిజమైనసౌఖ్యంబు
సరసంబు మర్యాద కొఱఁతవడును
గీ. సత్యరాహిత్యములపొందు సఖ్యమున్న
మాయమాటలకందు సన్మానమన్న
నందు నిందు నెందునుగూడఁ గుందుచెందు
వలదు బిరుహ్మాదునైన రోఁవెలఁది పొందు. 176

వ. అంతం గొంతవడికి. 177

చ. అరుణుఁడు నస్తమించె వికచాంబుజముల్ ముకుళించె నెల్లచో
సరసిరుహాంతరాళముల షట్పదసంతతి సుప్తిఁగాంచెఁ బ
త్రిరథకదంబకంబు తరురాజపుగూఁడుల విశ్రమించె న
మ్మరుఁడు ధనుస్సు నెక్కిడి తుమూతలమెల్లఁ జరించె నత్తఱిన్. 178

—• ఆశ్వాసాంతము. •—

కం. రాజాది లక్ష్మలక్షిత!
రాజాధిపతుల్యవిత్తరాజివిరాజీ!
రాజోపమాన వైభవ!
రాజామలకీర్తిరంహా! రాజనృసింహా! 179

ఉ. పండితమండలీవిమలపంకజషండవికాసకారిమా
ర్తాండ! హిమాంశుఖండశరదండసితాభ్రపటీరసారవే
దండతుషారహారరజతాద్రిసమానయశఃప్రకాండ! ప్రో
ద్దండసుమండలాగ్రపరిదండితచండవిరోధిమండలా! 180

మాలిని:- బుధజననుతకీర్తీ! పుణ్యమార్గప్రవర్తీ!
మథితసుజనతార్తీ! మంగళస్వీయమూర్తీ!
పృథుకదనవిసర్తీ! భీరుబాధానివర్తీ!
ప్రథితసుగుణపూర్తీ! భావనాచక్రవర్తీ! 181

## గ ద్య.

ఇది శ్రీశిష్టావంశపయఃపారావారరాకాకైరవమిత్ర శ్రీ సూర్య
నారాయణశాస్త్రిపుత్ర బుధజనవిధేయ వేంకటసుబ్బయ
నామధేయ ప్రణీతంబైన హృదయాభిరామ
మను మహాప్రబంధమునందుఁ
తృతీయాశ్వాసము



శ్రీ ర స్తు.




# చతుర్థాశ్వాసము.



వేంకటనరసింహ
క్ష్మావర! కల్పద్రుమాధికత్యాగశ్రీ
భావిత! కరుణాధికకృత
వైవస్వతపుత్ర! విజితబలవదమిత్రా! 1

సీ. లలితప్రవాళపల్లవపటలమ్ముచే
బాలరసాలము ల్పరిఢవిల్లెఁ
గోమలకలకంఠకుహూకుహూధ్వనులచేఁ
చైత్రికసమయంబు చాటఁబడియె
వికసితశతపత్రసికురుంబములచేత
జలజాకరంబులు తెలివిఁగాంచె
సంఫుల్లమల్లికాస్తబకపంక్తులచేత
వల్లీమతల్లిక లుల్లసిల్లెఁ
గీ. బండితప్రకాండకథితభారతాది
సత్కథోపకథాద్భుతసరణివిని వి

లాస మొప్ప 'ఊ' కొట్టు బాలకులచేత
సంతతామోదమయ్యె వసంతఋతువు. 2

సీ. కలకంఠములుగూయఁ గలికిపలుకులెంచి
మానసంబులఁ గడు మ్రగ్గువారు
శతపత్రములఁగాంచి సతి కన్నులఁ దలంచి
మోహవారాశిలో మునుఁగువారు
ఉదయశైలమునందు నుడురాజు నీక్షించి
వెలఁది మోము దలంచి కులుకువారు
లికుచంబులఁగని చెలికుచంబులఁ దలంచి
యెక్కుడు విభ్రాంతిఁ జిక్కువారు
గీ. చంచరీకముఁ గబరిగాఁ నెంచువారు
పల్లవంబులఁ గుసుమాస్త్రబాణవితతి
గాఁ దలఁచి విప్రలంభార్తిఁ గాంచువారు
ఋతువతంసమౌ వాసంతఋతువునందు. 3

వ. అట్టి మదనోద్దీపకంబగు పుష్పసమయంబున లీలోద్యానవనంబున సంచరించు రామునకు సుందరీదత్తసౌఖ్యపరంపర లయాచితంబుగాఁ దలంపునకు రాఁగాఁ దత్స్నేహార్ద్రప్రవాహానివహానిమగ్నత నాతఁడొనర్చినవియు నవ్వనితారత్న మొనర్చిన కృత్యంబులను జ్ఞప్తికిఁ దెచ్చుకొని యంతలోనే వియోగంబు సంఘటింపఁజేసిన యామూలదైవమును నిందించుచు నిట్లు తలపోయఁజొచ్చె. 4

చ. సలుపఁగలేదు యత్నమును స్వప్నమునందుఁ దలంచలేదు నే
నెలమిని నీకు నాకు నెపుడేనియు మైత్రి ఘటిల్లునంచు వి
త్రిడకయ స్నేహభూమిరుహ మేపు వహించెను సుందరీమణీ!
గుడిపయి నెట్టులో మొలవఁగూడిన మఱ్ఱినుజంబు చాడ్పునన్. 5

చ. తొలుతనె గాఢమై యొసఁగ దూరము సాగదటంచు మైత్రి య
ట్లలవడకుండఁగా మొదట నంటియునంటనియట్టులుండి య
చ్చెలిమి క్రమక్రమంబుగ విశేషముగా నభివృద్ధినొందె ని
చ్చలు సితపక్షచంద్రువలె సజ్జనమైత్రికి లక్ష్యమోయనన్. 6

చ. వలపులకొమ్మలందు సుఖపల్లవముల్ చిగిరింప నొప్పులన్
గులుకు విలాసముల్ విరులకోటులుగాఁగ మనోరథాఖ్య స
త్ఫలములఁ బెంపుమీఱు మన భాసురసౌహృదవృక్ష మప్పుడే
బలితపుదుష్టదైవమను వాయువశంబునఁ గూలె నక్కటా! 7

చ. కుడిచితి మొక్కకంచమునఁ గూరుకు నొందితి మొక్కమంచమం
దడరుచు నెల్లకార్యనిచయంబుల నిర్వురమాట పాటిగాఁ
గడపితి మేండ్లుపూండ్లును సుఖంబుగ నయ్యవి మాటిమాటికిన్
దలఁచి తలంచి పొక్కుమని ధాత లిఖించెనె నాకు సుందరీ! 8

చ. బడలిక హెచ్చి నే వెతలపాలయి కుందెడుపట్టునందు న
న్నొడి నిడుకొంచు హాయిమెయినొత్తుచు నాదగుపాదయుగ్మముల్
బడలిక వాపి వెచ్చనగుపాలను గ్రోలఁగఁజేసినట్టి ని
న్విడువఁగనయ్యె నీఋణము పెంపును దీర్పకమున్నె నెచ్చెలీ! 9

ఉ. వాదము వచ్చినప్పు డనివారితరోషము పేర్మి నిన్ను నే
మోఁదినఁ గోఁతవెట్టినను మ్రుక్కడివంచును దిట్టిపోసినన్
గాదన వయ్యయోయనవు కాఱులు ప్రేలవు పీడవెన్నడున్
సూఁదిని దారమట్లు నను జొచ్చితి వెంతగుణాఢ్యవే ప్రియా! 10

చ. తినుమని యెవ్వరేమిడినఁ దెచ్చి గృహంబున దాఁచియుంచి వ
చ్చిన సఖి రాకయున్న మరి శీఘ్రముగాఁ 'గబురంపి' నాకు మ
న్ననఁ దినిపించియున్ మిగిలినన్ దినియున్ దినకుండి లేనిప
ట్టున నను గారవించితి వెటుల్ మఱవంగలవాఁడ నిన్నియున్. 11

చ. పెనఁగొని వేల్పుపాటి మురిపెంబున నేపువహించినట్టి నీ
యనుపమసౌహృదంపులత నయ్యయొ యెట్టులఁ ద్రుంపివైతు వి
న్ననువునఁ ద్రోసివైచినను నన్నులనుంగను గ్రిమ్మఁటిల్లు నె
మ్మనమునఁ బుట్టి ప్రాఁకె నవి మానుపశక్యమె యోరి కేనియున్. 12

ఉ. నిం గనుభాగ్య మెన్నఁటికినిం గలుగంగను జీవ దానవా
లుంగను నుంగరం బిడితి లోలవిలోచన! దానిఁజూచుకొం
చుం గలకాలమున్ గడుపఁజూతువు నేనిఁక నేమియూనవా
లుం గని ప్రొద్దుపుచ్చుదునొ లోఁ దలపోయుటతక్క పైదలీ! 13

ఉ. అచ్చపుమంచునన్ జలకమాడి వసంతసితాంత శర్వరిన్
బుచ్చపువుం బలెం బొలుచు పూర్ణసుధాకరకౌముదీతతిన్
విచ్చినకుందసూనములఁ బేర్చిన సెజ్జను నిన్ను జేర్చి యా
పచ్చనివింటిజోదు పనిఁబట్టుట యొక్కటె చాలుఁ బ్రేయసీ! 14

ఉ. సారములేని కైత ఘనసారములేని విడెమ్ము చంద్రికా
సారములేని రాత్రి రససారములేని రతంబు సౌరభా
సారములేని పువ్వు మనసార భవాదృశకాంతతోడి సం
సారములేని జన్మయు నసారము నాఁగదె సారసేక్షణా! 15

శా. ఓలోలేక్షణ! దేశదర్శనవినోదోద్యోగ మేపార ను
త్తాలారామవిశాలరమ్యతరసౌధవ్రాతసంశోభితం
బై లావొప్పెడు బొంబయీపురియు నన్యక్షేత్రముల్ నీకు నేఁ
జాలం జూపితి నద్భుతం బెసఁగ నాఁజాడల్ మదిం బాయునే? 16

చ. సురుచిరసైకతస్థలుల శోభితపుష్పవనాంతరంబులన్
బరిణతచంద్రికాసలిలభాస్వరశారదరాత్రులన్ మనో
హరతరశాద్వలావనుల హారిసమున్నతసౌధవీథులం
దు రతుల సల్పినార మవి తొయ్యలి! నీస్మృతి కెక్కకుండునే?

శా. ఆనాఁ డీవును నేను గూడి చను చుద్యానంబునం దొక్కెడన్
నానావల్లిమతల్లికాజటిలసూనస్థానమం దుండ నా
సూనాస్త్రుండు శితాస్త్ర మేయ రతికిం జొక్కించి యోనిద్ధము
దైన న్ముద్దియ! నీదు చిత్తమును నద్దంబందు బింబింపదే? 18

ఉ. క్రొన్ననవింటిజోదుపని గూరినవేళ మదాస్యమండలో
త్పన్ననితాంతఘర్మజలధారలఁ గాంచుచు వట్టివేళ్ల మేల్
వన్నెలవీవనన్ వెడలు వాయుపరంపర సేదదీర్చి నా
మన్ననఁ గొన్న నిన్నెటులు మానిసి!నామదిఁ బాయఁగల్గుదున్·

చ. పొలుపగుగబ్బిగుబ్బలును బూర్ణమృగీధరసన్నిభాస్యమున్
జలజమునేలు కన్నులును చంపకసూనసమాననాసయున్
లలితభుజామృణాళవిమలస్ఫుటదీప్తిచయంబు నామనః
ఫలకమునందుఁ బాదుకొని పాయవుగా కలనైన సుందరీ! 20

చ. ఇరవుగఁ గాళహస్తిపరమేశ్వరుఁ డొక్కఁడు సాక్షి పండరీ
పురవిభుఁ డొక్కసాక్షి యల ముంబయిదేవతసాక్షి ద్వారకా
తిరుపతివేంకటేశ్వరుని దివ్యపదంబులు సాక్షి నిన్నుగా
కొరుఁ గవగూడ నేననుచు నొట్టెదుకొంటివిగాదె సుందరీ! 21

ఉ. అంగజసంగరోద్భవసుఖైకచమత్కృతు లెంచికొంచు నా
రంగలవంగలుంగతరురాజములం గనుఁగొంచు నింపుగన్
గొంగును గొంగు పట్టుకొని కొండలకొమ్ముల నెక్కినార మా
సంగతు లంగనామణి! ప్రసక్తివిదూరములయ్యెనే కటా! 22

చ. ఇదెసుమి చంద్రభాగసరిదీశ్వరి మత్తమరాళగామినీ!
యదెతపనీయగోపురవిహారవిలోలకపోతజాత మ
ల్లదెకద విఠ్ఠలేశ్వరుని యాలయసీమ యటంచునీకునిం
పొదవఁగనింకఁజూపఁగలయోగ్యతగల్గునెనాకుసుందరీ! 23

ఉ. పూచినపుచ్చపూవనఁగఁ బొల్పగు వైద్యుతదీపికా లస
ద్రోచి నవీనఫేననికురుంబవిముక్తముహుర్ముహుర్లుఠ
ద్వీచి లతాకుడుంగచలవిస్తృతమందసమీరపాళి కా
ణాచి ఘృతాచి చెన్నపురి నాడెఁపు'బీచి' లతాంగి దోఁచునే!

మ. బహుళామోద లసత్ప్రసూన మహీరుడ్ద్వారాంతరోర్వీస్థలీ
నిహితంబైన 'లవర్సుపాత్తు'నను నెన్నే భావముల్ గల్గఁగా
నహరంతంబుల నిన్ను దోడ్కొని గృహీతాన్యోన్యహస్తంబులన్
విహరింపంగలభాగ్య మింకొదవునే నీరేజపత్రేక్షణా! 25

మ. "ఎలిఫెంటా"ఖ్య గుహావిహారరతిమై నేగంగ నుత్తుంగ ని
ర్మలలోలోర్మికదంబయుక్తమగు సంద్రింబాదు నా కల్ల యో
డల'సీసిక్నెసు'రాఁగ నీతొడతలాడన్ నాశిరంబుంచి పే
శలవాచాసుధ నన్నుఁ దేఱిచిన యాచందం బెదం బాయునే! 26

చ. పులకలచేఁదనర్చెడు కపోలము నేనటు ముద్దుగొంచు నీ
వెలమిని దొంగనిద్దుర నటించెదవేలనె యంచుఁ బల్కు నా
పలుకుల కోపలేక కనుపాప సగంబును విచ్చిచూచు నీ
చెలువము చెల్వ! నాహృదయసీమను బాయునెయెన్నఁడేనియున్•

ఉ. చొక్కపుటేడుకుం దగినసోయగ మూపయి భూషణావళుల్
చక్కఁగ దిద్ది నీవు సుమసాయకు తేజియనంగఁ దారుచున్
దక్కుచు వెంటనంటఁ బ్రిజ తాఁ దటకాపడిచూడఁ గొండపై
కెక్కినయట్లు నిక్కితిఁజుమీ! నెఱనిక్కది స్రుక్కఁజేయదే! 28

ఉ. ఏటికి దేశయాత్రలకు నేగితి మచ్చట నిన్ను నన్ను న
బ్బోటులు లయారె! జోడుసరిపోయెను వహ్వారె! యిట్టులుంట యే
పాటియదృష్టమోయనుచుఁ బల్కిరి వారల దృష్టిదోషమే
నేటికి దెబ్బగొట్టె నిఁక నేగతి నోర్తు భవద్వియోగమున్, 29

ఉ. విత్త మొసంగకున్న యెడ వీడె మొసంగరు కొంతమంది ప
ల్లెత్తును బల్కఁబోరు ధన మీయమిఁ గొందఱు నింకఁ గొందఱో
విత్తము లాగియున్ మనసు వీస మొసంగరు విత్త మీయకే
చిత్తజరాజ్యలక్ష్మి కభిషేకము సేయవె నన్ను ప్రేయసీ! 30

మ. విరిసెజ్జం దరుషండమండితవనోర్వీదేశమం దున్నతిన్
హరువొప్పం బవళించి నీతనువు నాకర్షించుచో మాగసం
గరసంజాతకరాబ్జకంకణఝుణత్కారంబు లేపారి గిం
గురుమంచున్ జెవిలోన మ్రోయు నిపుడున్ గోకప్రశస్తస్తనీ! 31

కం. జిలిబిలిపలుకులఁ గులుకుల
గిలిగింతలఁ జుంబనములఁ గేరింతల నో
యలికుంతల నీచెలిమిని
సలిపెడు బలుకలిమి యింక సమకూడునొకో! 32

సీ. నారీశిరోమణి నడుము విష్ణుపదమ్ము
జవరాలి చనుదోయి శివపదమ్ము
రమణి ముఖమ్ము హిరణ్యగర్భపదమ్ము
నాతి వేనలి సుమనఃపదమ్ము
భామినీమణి నితంబంబు కాంచీస్థలి
వనితామతల్లిక వాణి మధుర
ధవళాయతాక్షి యధర మరుణాధరమ్ము
రామ గాత్రంబు శ్రీరంగభూమి
గీ. పరమయోగీంద్రసంపత్ప్రదమ్ము
లగుపదమ్ములెల్లఁ గలిసి యువనియందు
యువతి సర్వాంగతీర్థమై యొప్పుచుండఁ
దీర్థముల కింక మానవుల్ దిరుగనేల? 33

ఉత్పలమాలిక:—

పెలుచన నాల్గునాళ్లు నిను వీడ్కొని నే మఱునాఁడు సేర నీ
వలుక నొకింతసేపు భవదానన మవ్వలి దిక్కునర్ప మా
ర్వలుకక యేను నుండ నది వహ్నివలెన్ నిను గాల్ప దానినేఁ
దెలిసి తటాలునన్ బిగువుదేరిన కౌఁగిలినీయ నీవు పైఁ
బడి పురుషాయితంబునకుఁ బాల్పడి నీఘనవేణిఁ గ్రొవ్విరుల్
జలజలరాల్చి చారుఘనసారపటీరసుగంధవస్తుసం
కలితకుచోరుకుంభముల గాఢసుఖానుభవంబుమీఱ నా
యెడఁద నలంకరించుచు యథేచ్ఛము మోవి సుధారసద్రవం
బెడనెడఁ గ్రోలుచున్ నను సుమేషుమహోన్నతపట్టభద్రతో
జ్వలు నొనరించి నగ్నవయి చయ్యన నీవటు లోనికేగున
ప్పుడు విలసద్వసంతపరిపుష్పరసాలకిసాలయవ్రజం
బులఁ గడుపార మేసి కడుముద్దులుగుల్కు వనప్రియాంగనా
గళవిగళత్కలస్వనని కాయనిభంబగు నీదు పల్కుతే
నెలఁ దనివారఁ గ్రోలుచు వినిర్మలమానసవృత్తి నుండఁగాఁ
దొలకరికార్మొయిళ్లగతిఁ దోఁచు కచప్రచయంబు దిద్ది తా
వులు వెదచల్లు పూసరులు పొల్పుగఁ జుట్టి శశాంకు నవ్వు నీ
కలితముఖాబ్జబింబమునఁ గమ్మనికస్తురిబొట్టు పెట్టి యిం
పులఁ దులకించు చిన్నిపువుఁబుట్టము గట్టియుఁ బట్టురైకనుం
దొడిగి పసిండిబొంగరపుదోయికి దాయలనంగనొప్పు గు
బ్బలపయి ముత్తెపుసరులు బల్విడి నృత్యముసల్ప లేఁతచే
తులఁ దులలేని కంకణరుతుల్ సెలఁగంగ సువర్ణమేఖలా
లలితఘులంఘులారవవిలాసము లుప్పతిలంగ నీవు రాఁ
దలఁపులచూలి నాతలఁపుఁ దత్తఱఁబెట్టఁ బునారతిప్రదీ

పుత్త్రుఁడనయి శయ్యఁ జేర్చి పరితోషము మీఱ విరోధియైన పూ
విలుతునిఁ బాఱఁదోలితిని వ్రేల్మిడిఁ ద్రిప్పుకొలంది వచ్చెఁగా
పె లలితమైనసంగతులు తేలునె చెప్పఁగ నిప్పు డవ్వి హృ
త్తలమును జీల్చుచున్న వెటుతాళఁగఁజాలుదు నింక సుందరీ! 34

వ. ఇట్లు తనమనోశ్వం బిచ్చవచ్చిన తెఱంగున గంతులిడ మోహాం
ధుండై యంతములేని సంతాపంబు నొంది కించిత్ జ్ఞానప్రకాశం
నం బడి తెలివి తెచ్చుకొని యజ్ఞానకామ్యకర్మంబులం దిరుగు
వేదనాపరుల పాపాటవులకు శ్రీకృష్ణ నామస్మరణ చింతన వంద
నార్చనాదులు కార్చిచ్చులని తలంచి కాలగతికి లోనుగానితఱిఁ
గాలుసేతులాడుతఱిఁ దీర్ఘయాత్రలకుఁ గదలవలయునని యెంచి

ఉ. శ్రీరమణీప్రియా! వరద! శేషశయాన! దయార్ద్రచిత్త! సం
సారవిలుంఠనక్రమవిచక్షణ! దక్ష! మహేశ! భక్తమం
దార! జగన్నివాస! యను నామపరంపర మాటిమాటికిన్
నా రసనాంచలంబున ననారతముం బలికింపు మీశ్వరా! 36

చ. మరణముసిద్ధమై యెలుఁగుమాఱుచుఁ దత్కఫవాతపిత్తముల్
పోరిపోరిఁ గంఠసీమఁ బోరిపుచ్చెడువేళఁ ద్వదీయనామసం
స్మరణ మనంగ నెక్కడిది మామకమానసరాజహంస నీ
పరమపదాబ్జపంజరనిబద్ధ మొనర్పవె కృష్ణ! యిప్పుడే. 37

వ. అని దైవముం బ్రార్థించి యీప్రపంచంబెల్ల మిథ్యయని తలంచి 38

శా. మిత్రుల్ ద్రోహులు శత్రులాత్మజులు సామీనల్ గడుం గల్లలున్
ధాత్రీభోగము లస్థిరంబు లలగాత్రంబుల్ ప్రయాతవ్యముల్
యాత్రల్ పాపలతాలవిత్రములు మోక్షాసన్నతంబొల్చు నీ
లా త్రోవల్ సుమి యంచు నెమ్మిఁగొని హాస్యాయత్తచిత్తాబ్జుఁడై. 39

వ. రాముండంత నిజజాయాసమేతంబుగా నొక్క శుభముహూర్తంబున విరజాపురంబునుండి బయలుదేరి మఱునాటికి మహాజనసమ్మర్దఘుట్టితంబగుచెన్నపట్టణంబుఁ జేరుకొని వృజినదారణప్రదరంబగు చిదంబరంబున కేగి భక్తపరికాండకాంచనఖండకషణపాషాణంబగు నవపాషాణంబున కరిగి నిర్భరముక్తిపథాయనంబగు దర్భశయనంబు నతిక్రమించి మోక్షురమేశ్వరంబగు రామేశ్వరంబు సేవించి మజ్జనమాత్రోద్ధూతజనదురితజనుష్కోటియగు ధనుష్కోటినిఁ దానంబులాడి చూర్ణీకృతమహాకలుషకుధరయగుమధుర నారాధించి చతురాననాదిసిద్ధరస్తుతరవికోటిప్రకాశాభు ననంతపద్మనాభుఁ బూజించి కిల్బిషమర్దనంబగు జనార్దనంబు నవలోకించి పాపములకు మారియగు కన్యాకుమారిఁ గొలిచి ముక్తికాంతామణీరంగంబగు శ్రీరంగంబునం దంతరంగం బుప్పొంగఁ గొన్నిదినంబులుండి సకల సౌఖ్యకల్పవల్లియగు తిరుచునాపల్లికిఁ బయనంబై భక్తజనకలుషపలలాసురాయమానతలంబగు నరుణాచలంబున నిలిచి యభ్యంచితసౌఖ్యముల కాపురంబగు కాంచీపురంబు గాంచి విలూనవిశంకటవేంకటగిరియగు వేంకటగిరి కెగఁబ్రాకి యనంతకోటిసూర్యప్రభావిభాసుఁ గాళహస్తీశు దర్శించి నియమవ్రతుండై తిరిగితిరిగి నలువదియైదుదినంబులకుఁ గృతార్థుండై మఱలివచ్చుచుండె. అంత గ్రామశకటంబు లీలాపురముదగ్గరఁ బదునైదునిముసంబులునిలిచె నంతలో రాముఁడున్న పెట్టెలోనికి దోడదోడ వచ్చి యెనమండ్రువెలయాండ్రు ప్రవేశించిరి. అందు రాజ్యవల్లి యను వేశ్యామతల్లి మందస్మితసుందరముఖేందుబింబయై రామునకు దండముఁ బెట్టె. 40

శా. ఓహో! రామయబావగార! తమ రేయూ రేగుచున్నారు మి
మ్మాహా! చూచెడుభాగ్య మిప్డాదవె సౌఖ్యాయత్తులే యుంగటుఁ

గేహంబందు సహోదరుల్ కుశలులే క్షేమంబె మాయక్క సద్వ్యాహారంబునఁబెండ్లికేగుదుము పుణ్యాహంబునేఁడెంతయున్

వ. అని హేమయనుకాంతామణిం జూపి. 42

ఉ. ఎన్నిదినంబులాయెఁ జెలి నీకుఁ ణనేసియటంచు వచ్చె నీ యన్నలమిన్న చూచుటకె యక్కను నిమ్ములఁ గాసి మీర లచ్చెన్నపురమ్ము 'కోట్ట'పనిచేఁ జనినారని యక్క చెప్పెఁ దా నున్నది నాల్గునాళ్ళె యిఁక నుంటకు వీలు ఘటిల్లమిన్ జనెన్.

వ. అని రాజ్యవల్లి చెప్పుచుండ సుందరికి నాహేమంకుంగల చిన్ననాటిమైత్రి జ్ఞప్తికిరా హేమ రాజ్యవల్లిమాట కడ్డువచ్చి రాము నితో బావగారూ! మామైత్రి చెప్పఁదరంబుగాదు. చాదస్తమనుకొనకుఁడు. 44

సీ. వెలజవ్వనులయింట వెలసినసాధ్వి యీ
సుందరియని మున్ను జోసి వలుకఁ
బిల్లికడుపునఁ బులిపిల్ల పుట్టునె యంచు
నదిమొదలెకసక్కె మామెనాడఁ
'జూచెదులే'యంచుఁ జుఱచుఱచూడ్కులఁ
బఱపుచు నెచ్చెలి పాఱిపోవ
బలిమాలుకొనితెచ్చి పట్టుకోపమడఁప మా
తాతలు దిగిరాఁగ దాసినంక

గీ. నదిమొదలు నొవ్వఁజేసెడునట్టిమాట
లేక యేకశయ్యాసనలీలనుండి
యొక్కకంచానఁ గుడుచుచు నొక్కపాఠ
మగుచు హాయిగాఁ గడపితి మంత నకట! 45

గీ. కడకు దుర్దైవచేష్ట పోఁగడవరాని
నిరుపురముకూడ విడివడు టేరుపడియె
శ్యామలాపురివిడి విరజాపురికిని
సహకుటుంబంబుగా వారు చనినకతన. 46

ఉ. ఎన్నఁడు శ్యామలాపురపుటింతులఁ గూడి మెలంగినారమో
యున్నతసైకతస్థలుల నొప్పులకుప్పల నాడినారమో
యెన్నఁ డవన్నియుం గనుల కిప్పుడు కట్టినయట్లు తోఁచు నా
యన్నిఁటికంటె మిన్నయగు నాచెలిప్రేమకు నుద్దియున్నదే! 47

ఉ. బాము లవెన్నివచ్చినను బాల్గొని నాకయి చింతనొందు నీ
బాముని మేను రెండయి ప్రవర్తిలుచుండినఁ బ్రాణ మొందుగాఁ
గా మసలంగనయ్యెఁ బలుకంజన దీబోటవ్రేలిపోక కా
కామిని మొన్న యేడ్చె మఱి కన్నులబాపడి దీయదింతకున్ 48

గీ. ఒకటి మీకును మాయక్క కొకటి చిత్ర
ఫలకము లొసంగి తండ్రొక్క ఫలక మపుడు
తడుపఁబడె నాపె కన్నీటిధారచేత
నేది మీకిచ్చెనో యక్క యెఱుఁగవలయు. 49

వ. అని పలుకు హేమమాటల కుల్లంబునఁ బెల్లు కంగారుపడి రాముండు క్షణక్షణసంచలితాత్ముండై పూర్వవృత్తం బాను పూర్వికంబుగా జ్ఞప్తికిఁ దెచ్చుకొని తల పంకించి యాపె చేతికి బొట్టనవ్రేలు లేకుండుటయు మొఱకుందసపువ్రేళ్ళ నుంగరంబులను ననామిక మచ్చయు నచ్చంబుగాఁ జూచి రాముండు పరిసంగవశంబునఁ జమత్కారంబుగా నానాఁడు సుందరిప్రక్క లోఁబఁడుకొనినదా హేమయేయని యాపెవాక్యములమూలమున రాఁబట్టి సంచలితస్వాంతుండై 50

మ. అరరే! యెంతటిద్రోహ మిక్కలికియే యానాఁడు మత్సుందరిన్
బరియంకంబునఁ గౌఁగిలించె నిచటన్ బ్రత్యక్షమేయయ్యె నా
కరమేయీకరమాయసామికపయిన్ గ్రొల్లచ్చ యీమచ్చయుం
గరముల్ గూడ నవేసుమీయని మనస్కారంబు గావించుచోన్

వ. తటాలునగమ్యస్థానము వచ్చినతోడనే బిలబిలలాడుచు నయ్యైన మండ్రు వెలయాండ్రును దిగిపోయిరి. రాజ్యవల్లి రామునికడ సెలవుదీసికొని వెడలిపోయెను. రాముండు దాఁ బూర్వం బనాలోచనీయంబుగా నొనరించిన పనికిఁ బరిపరి విచారించి వెండియు సుందరీవర్తనంబు లెస్సగాఁ బరీక్షించుటకదియును మంచియదనేయని నిశ్చయించుకొనె. ఘూమశకటంబు విరజాపురంబు సేరుకొనెనంత జాయాసమేతంబుగా వివిధతూర్య ధ్వానంబులతో భూసురవతంసుల వేదఘోషంబులతో నూరెల్ల నూరేగి గృహప్రవేశంబై మఱునాఁ డష్టాదశవర్ణములవారికి మృష్టాన్నంబులతో సమారాధనం బొనరించె. రాముని బంధుమిత్రులానందతుందిలహృదయారవిందులై వానిం గౌరవించి మించినయాసక్తి 52

కం. ఏయేపుణ్యక్షేత్రము
లేయేతీర్థవ్రజంబు లేయేదేశా
లేయేగిరులను జూచితి
రాయావింతలను వీనులారఁగఁ జెపుడీ! 53

కం. ఉన్నార మెదురుచూచుచు
నున్నారము వినెడువేడ్క నున్నదియున్ వి
ద్వన్నుత! విన్నదియున్ మఱి
కన్నది కన్నట్లు చెప్పఁగావలె మాకున్, 54

వ. అని యడిగిన రాముండు విరజాపురంబు వీడినది మొదలు తిరిగి వచ్చువఱకుం దావిన్నదియుం గన్నదియు నిట్లు వర్ణింపఁగాఁ డొడంగె. 55

—• చ ం ప క మా లి క •—

విరజపురంబు వీడి యటుపిమ్మట నొప్పఁగఁ జెన్నపట్నముం
బరువడిఁ జేరి దాని పెనువైఖరి గన్గొని పార్థసారథి
స్ఫురితపదాంబుజంబులకు మ్రొక్కిడి దేవిని వేదవల్లినిం
గరము నుతించి యంత శివగంగయనంగ నెసంగు మేలికో
నెఱు మరి వేయికంబముల నిగ్గయి పొల్చెడు మండపంబునుం
బరగఁగ నుప్పరం బొరయు భాస్వరశిల్పకళాకలాపగో
పురములునుం జతుర్దిశలఁ బొల్పెసలారఁగ *యూనివర్సిటిం
దిరముగ నిల్పి పేర్వడిన ధీనిధి యన్నమలయ్యసెట్టి య
బ్బురముగఁ గాసుబంగరునఁ బూన్చిన కప్పు ధగద్ధగద్యుతిం
బరపెడు నాలయాంతరమునం మహిమం శివకామసుందరీ ౧౦
వరనటరాజు లుల్లసిల వజ్రమయంబును బద్మరాగమూ
ర్తి రహిం వెలుంగు లింగములు రెం డభిషేకములందు రెంటికిం
జరిగెడుఫక్కి లోకమునఁ జాగురెఁ చూడఁగఁజాల మెచ్చుటం
బరమ♦రహస్యమంచు నొకపర్క్కకు మేల్తెర నొత్తిగించి యో
నరవరులార! చూడుఁడని నల్లనిగోడను వ్రేలుగోల్పు లా
దరమునఁ జూపుచుండు రది తథ్యము సర్వము మిథ్యయంచునుం
గఱపెడితత్త్వసారమగుఁ గావున ముక్తిద మాచిదంబరం
బరయఁగఁ △బంచలింగములయం దది విష్ణుపదంబు పూర్వమ

*Annamalia University ♦చిదంబరరహస్యము.

△పృథివ్యాపస్తేజోవాయురాకాశలింగములు,

ప్పురమున నొక్కయద్భుతము పొల్చెసటందు రదేమనంగ న
బ్బురముగ గంప బియ్యమును బోసి జలంబులఁ గడ్గివైచి యం
బరమునఁగప్పి లింగములప్రాంగణమందు ఘటించి పిమ్మటన్
బరిమళముల్ గుబుల్కొను నన ల్గొని లోగుడిలోని దేవునిన్
గురుతరపూజలన్ సలిపి గొబ్బున బియ్యపుగంపఁ జేరి యం
బరమును దీసి యర్చకులు పైకొని చూడఁగ నందు సన్నమై
వరలును జక్కగానుడికి వారలు భక్తిఁ దదన్నరాశితోఁ
గరమభిషేక మద్భుతముగానొనరింతురు ప్రత్యహం బిఁకన్
బఱపితి మాప్రయాణము నవగ్రహముల్ గల దేవిపట్నపుం
బరిసరభూమి కచ్చట నపాంపతిలో మొలలోఁతునీటిలో
వఱలు నవగ్రహంబులకు భక్తి దలిర్పఁగఁ బూజచేసి యం
తరమున దర్భశయ్య గని దారుణభీమతరాకృతిం గరం
బరుదుగఁ దాల్చి దర్భనిచయంబులపేరిఁటిప్రస్తరంబుపై
విరివిగఁబండియున్న రఘువీరుని పాదసరోజయుగ్మమున్
దిరమగుభక్తితోఁ గొలిచి దీవిని*రామశివంబుఁ జేర దు
స్తరమయి యూర్జితంబునయి సాంద్రతరంగసమేత వార్ధిఁగ
ట్టిరి♦పెను'బ్రిడ్జి''పాంబను' సిటీవల హయాణులు దానిమీఁదుగా
నురవడి నేగు'రైలు'కనులున్నఫలం బటఁగాంచఁగల్గెడిన్
'బరితెగి' నాలుక ల్దెఱచి పర్వులువాఱెడిపాఁపఱేండ్లు వె
న్దఱుముచు వచ్చుచున్నటులఁ దత్సలిలోర్మికలొప్పు దానినిం
గరము గ్రమించి వాయుజుఁడు గ్రచ్చఱఁ దెచ్చిన శంభులింగమున్
*వెఱపునఁ గొల్చి తొల్దొలుత వేష్టితభూరివిశాలసాలమై

---

*రామేశ్వరము. ♦Pambon Bridge.

*హనుమంతుని గర్వభంగ గాథ నిచ్చటననుసంధింపవలయును. (రామేశ్వర

నెఱిగల లోగుడిఁ నిలిచి నేరక నేర్చి యొనర్చు ఘోరదు
స్తరకలుషప్రకాండమును దవ్వుగఁదోలెడు రామలింగనా
థు రుచిరపాదపద్మయుగధూళి శిరంబునఁ దాల్చి యచ్చటన్
దురితలతాలవిత్రయయితోఁ జెడు పర్వతవర్ధనీపదాం
బురుహములందుఁ గుంకుమముఁ బూజయొనర్చితి శుక్రవారశ
ర్వరిఁ గరదీపికల్ వెలుఁగ × బంగరుపాలకి దేవినిల్పియున్
వరనవరత్నసంస్థగితభర్మమయాభరణప్రకాండమున్
జెఱివిన యాపె ముంగలను జేరిచి చెల్వగు నిల్వుటద్దమున్
మెఱసెడుపట్టుదిండ్లు వెనుమేనను గీలిచి జీవజంతువుల్
తురఁగము లాంటె లేన్గలును దో నరుదేరి హళాహళిన్ సదా
నెఱపఁగ దేవదాసి తననేర్పు మెయిన్ నటనంబు సల్ప వి
స్ఫురదురువిద్యుదాభలకుఁ బుట్టినయిల్లయి పుచ్చపూవునై
వరణములోననే జరుగు వారపుటుత్సవవైభవోన్నతిన్
ధర నిఁకనెచ్చటం గనము దానికి నీడదె దేవళంబులో
నిరువదియేడుతీర్థములు నేర్పడియున్నవి భక్తకోటికిన్
విరివిగఁ జెప్పెదన్ వినుఁడు వేడుక 1లక్ష్మణ 2రామతీర్థముల్
వరఁగు ‡ 3సుకంఠతీర్థమును పావన 4మంగదతీర్థ మంతటన్
వరలును 5గంధమాదనము 6బ్రహ్మవిమోచన 7మగ్నితీర్థమున్
బిఱుద 8నగస్త్యతీర్థమును బిమ్మట ♦సంజలమూటియందు వె
వ్వేరుతనువుల్ ధరించెడుపవిత్రపుటమ్మల9 10 11మూడుతీర్థముల్
సరవిని 12మాధవంబు మరి 13చక్రము పేరిఁటితీర్థముల్ విభా

మాహాత్మ్యము) × బంగారుపాలకీవిలువ రూ 159081-3-7 లు. ‡సుగ్రీవతీర్థము
♦ఉదయమునగాయత్రి, మధ్యాహ్నమునసావిత్రి, సాయంత్రమున సరస్వతీ
సంజ్ఞలుగాననివి గాయత్రి, సావిత్రి, సరస్వతీతీర్థములనిగ్రహించవలెను.

సుర♦నల ♦నీలతీర్థములు ♦సూర్య ♦సుధాకరముల్ ♦గవాక్షముఁ
మఱియు♦గవమ్ము♦గంగ♦యమునమ్ము♦గయాఖ్యమునైనతీర్థముల్
పౌరి 23శివ 24శంఖతీర్థములు*ముంగల 25సాధ్యపదప్రయుక్తమై
బరఁగుసుధాఖ్యతీర్థ మివిమాన్యము లిన్నిఁటఁగ్రుంకి దీవికిఁ
సరిగఁ బదారుమైళ్లుగలసన్నుత ×కార్ముకకోటి కేగి సం
బరమున మౌక్తికావళికిఁ బట్టగు సింధుమహాబ్ధిసంగతిఁ
గరముఁ బవిత్రధామమయికొ్రాలెడు సేతుజలప్రజంబునఁ
ఖరతరదుర్నివారగురుకల్మషకాండసుదుస్సహామహో
త్కరఘనశాకినీనికరదారుణభీకరడాకినీపరం
పరలడుగంట స్నానములు మంత్రయుతంబుగ ముప్పదాఱు ము
ప్పిరిగొన భక్తిసల్పితిమి వేసరి దానిఁ దలంచుకొన్న దు
ర్భరమగుఁగాదె క్రమ్మఱుచు ‡రామపురస్కృతమైన యీశ్వరం
బఱిముఱిఁ జేరి దాని విడునప్పుడు పావన 26కోటితీర్థమం
దఱుదుగ 27సర్వతీర్థసలిలమ్ములఁ గ్రుంకి యనంతరంబునఁ
సురుచిరమైన యామధురఁ జొచ్చితి మామధురాలయంపుఁ బెం
పరయఁగ వేయికండ్లయిన నందకయుండుఁ దదాలయంబులో
నిరతముఁ బూలయంగడులు నిర్మలసౌరభసంయుతంబులై
మెఱయు విభాస్వరంబయిన మేల్గుడిలో నడిభాగమందు వి
స్ఫురదురుకాంతులఁ బరఁగి సుందరమై పరిమండితప్రగు
త్కరయయి *మీననేత్ర కడకన్నుల భక్తులఁ బ్రోచు సోమసుం
దరుఁ డలమీనకుం ధవుఁడు తల్లిదె వైభవ మెల్లవేళఁ బం

*సాధ్యామృతతీర్థము. × ధనుష్కోటి. ‡రామేశ్వరము.

♦ 14, 15, 16, 17, 18, 19, 20, 21, 22.

* మీనాక్షి

జరముల నద్భుతంబొలయ సారెకుసారెకు ‘మీన! మీన!’ యం
చు రహిఁ వెలుంగు కీరములసూక్తులెసంగఁ దదాలయంబునన్
పఱలును ♦పాటకంబ మది భవ్యశిలామయ మందుఁ జిన్నవౌ
నిరువదియాఱుకంబము లహీనచమత్కృతిఁ దోచు నొక్కటన్
సరవి నిముష్పగాఁ బడిన చందము మీటిన జంత్రిగాండ్రిటన్
సరిగమసారిగామసరిసారిగసారిగమాదిసుస్వరా
లిరువదియారురీతులుగ నింపుగ వెల్వడు నింతకంటెనుం
గరము విచిత్రచిత్రకళ కాశ్యపి నెందును గల్గునే గుడిన్ ౯౦
మెఱసెడుశిల్పనైపుణి యమేయము నిట్టిదనంగఁ బోలదున్
గురుతలశిల్పకోవిదులకున్ నిలయంబని చాటురీతిఁ ద
త్పురమున మేటికంబములఁ బొల్పు బవంతిరయొకండు చిత్రమై
× తిరుమలనాయకాఖ్య జగతీపతిమందిర మద్దిచూపులో
నరుని విలోకనప్రభల నర్మిలిలాగెడు మంత్రికాని య
ట్లురవడి లాగు దాని పృథులోర్జితచారుగభీరమూర్తి యా
నెఱె నుతిసేయఁగాఁ గవులునేరరు బొమ్మనువ్రాయ నెట్టి లే
కరులును వంచగావలయుఁగాదొకొ యాదల లౌర! వందు లెం
దరిగిరొ స్తోత్రపాఠముల కందనిదాని నుతింపలేక యా
బురుజులు పోతలోయనఁగఁ బొల్చెడుఁ గంబములన్న నద్భుతా
కరములు సిన్నముక్కయినఁ గట్టి రవంతయునైనఁగాసి త
త్పరిసరమందునేనిఁ గనుపట్టదుసూ! యిపుడున్నవన్నచో
నురుతరబుద్ధిశాలురగుహూణులుచేసినచేఁతలంచుఁ దా
రెఱుఁగకపోరుగాడె జను లెందరొకట్టిరి ముప్పదాఱు న

---

♦Music pillar

× Tirumala Naik palace.

త్సరములుపూర్వకాలమున దానిహోరంగును డాలోయారమున్
దోఱఁగదు పాఁతగిల్లదును దూలువహింపదు నేటిదాఁకనున్
హారహార! యట్టిశిల్పులకు నాకరమై తగు మాతృభూమి కే
పరులో బవంతి కొండొకటి 'పాకరటింకరలార్చి' కట్టఁగా
మురియుచు దానిఁ జూచుకొని ముచ్చట నందుట దాపురించె దు
ష్పరమగుదూరయాత్రికును బొల్పడి చేరి యనంతశయ్యఁ బు
ష్కరిణిని దానమాడి కనఁగా నటదేవుని లోనఁ జొచ్చినన్
హారిహారి! పద్మనాభుముఖమ్మైనను జూడఁగనీక కట్టిలం
దలుముదు రంతదూరముగఁ దద్విభు నుత్సవకాలమాటచేఁ
గరము శ్రీమన్మనోంది యొసకమ్మన లోగుడిలోనఁజొచ్చి యా
మురహరుఁ బద్మనాభు గని మోదమునందితి మామహేశు మే
ల్మిర మొకద్వారమందు సురసేవితనాభిసుమంబు మధ్యఁ బె
న్జరణము లొక్కద్వారమున శాంతగృహంబున వెల్గుచుండు బం
గరుకలశంబులన్ వరుసగా నభిషేకముసేతు రాలయం
బిరవయి దీపసంతతికి నింపు ఘటించెడుఁ బట్నమందుమా
యరఁటులపెంపుఁ గొబ్బరులవ్యాప్తి యనాసలలాలసత్వమున్
బరువుగలట్టి చూతముల భాగ్యము పన్ససిపోఁకచెట్లఁ గ్రి
క్కిఱిసినతోటగుంపులును నింపెసలారుచు మంచితేనియల్
పరిపరి చిందు మేల్పనసపండులతోఁపులుఁ బూవుఁదోటలున్
దఱచగుతావులుప్పతిలు తమ్మికొలంకులుఁ గొండవాఁగులున్
గరమును దోసిరాజనుచుఁ గ్రాలును మేలగుకోసనీమనున్
జిరసముపార్జితంబు లలిచిత్రములో గుడికట్టుబొట్లు దు
ర్భరముఁ గఠోర మర్చకులు భార్యలఁ గల్గియు బ్రహ్మచారులై
గుఱియయి షౌరదీక్షులకుఁ గోవెలలోనన విచ్చుకత్తులన్

మెఱసెడువారిపాల్పడియు 'మేటిసవారులు' యాత్రికాళ్ళపైఁ
బఱపుదు రీపురాధిపులవర్తన లెట్టివొ యాలకింపుఁడీ
పురపతిమేనయల్లునకె పోవును రాజ్యము చిత్రమక్కటా!
పరిణయమే హుళిక్కియఁట వానికి రాజట పేరుమాత్రమే
సరసిజనాభుఁడే నృపతి శంఖము చక్రము లందు నాణెముల్
పొరయవు సిగ్గునెగ్గు లటఁబొల్తులకుం గుచకుంభసీమ లు
ట్టుఱుకును మేటిబైళ్ళపయి కుందురు కొందరసహ్యరూపలై
పిఱుదులు మూయఁగట్టుదురు పెద్దది పిన్నదిగాని చీరఁ బే
రురముసఁ దుండు గప్పుకొని యొక్కముడిం బెనవెట్టి చుట్టుకొం
దు రకట! కర్ణరంధ్రములు దుద్దులుదూరెడునంత లేసి స్త్రీ
పురుషులరూపభేదములఁ బోల్చుట కాగుఱు తొక్కటేసుడీ
యరయఁగ వెన్నఁజేతనిడి యార్చెను నేతికటన్న పాత్రమాఁగరం
టిరవుగ నిచ్చుటే పాడమె నేమన నావులు బఱ్ఱెలుం బుఱిం
విరివిగఁ బాలనిచ్చినను పెల్లగుభోజనకార్యవేళలం
గరిటెడుగాని యింక నభిఘారముకైననుగాని యాజ్యమే
దొరకదు పిండివంటలను దోరపు వేపుఁడుఁగూరలందు నెం
దరసిన నెల్లవేళలను నచ్చుపుఁగొబ్బరినూనెవాడకం
బె రహి నెసంగు నట్లగుటఁ బెద్దలు దక్షిణమందు రోగి యు
త్తరమున భోగి యందు రిఁకఁ దద్దయు నప్పురియందుఁబొల్చు నా
గరకసితంబినీమణులఁ గాంచిన నిల్కడ గాంచినట్టి క్రొ
మ్మెఱుఁగులప్రోవులో పొలసి మిన్నుదొఱంగినచంద్రరేఖలో
బిరుదులకాంతలో చిదిమిపెట్టిన దీపశిఖాచయంబులో
గరిగరిగాఁగఁ బెల్లొరపుఁ గల్లున మాంటికి గీచినట్టి బం
గరపుసలాకలో వలపుగ్రమ్మెడు చక్కెరపల్కుబొమ్మలో

మరునెఱితూఁపులో యసము మాటలునేర్చిన మావిగున్నలో
నరుల కెఱుఁగశక్యమగునా యిక నాపురి మూఁడుమైళ్ళలోఁ
దిరువళి యొప్పు నప్పురిని దేవళమున్నది బ్రహ్మగారికిన్
బరువగుపండ్లతోఁటలకుఁ బట్టయి 'వర్కల' యన్న పేరిటం
బరఁగు*జనార్దనం బరిగి పశ్చిమనీరధిఁ గ్రుంకి బల్వడిం
బరపి హిరణ్య మచ్చటను స్వామి జనార్దనుఁ గొల్చి వెన్కకున్
మరలఁ ♦దబ్జనాభుపురమా యెడనింతయు లేదు మానసో
త్కరములనిండి భూవరుఁడు ధౌతపటంబు ధరించి పుట్టమున్
దొరఁగి యురాన టోపి తలనున్ గరవాలము చేత మూఁడుమై
ళ్లరవడిఁ గాల్నడం జనియె నుర్వి 'త్రివెండ్రము బీచి' వీథికిన్
గరితురగాలు 'మోటరు' నికాయముఁ గాల్బల మంటిరాగ న
మ్మఱుసటినాఁడు రాజు పురమార్గమునం జనెఁ గోటలోనికిన్
సురపతివైభవంబునకు జోడది నేనది వ్రాయఁబూన నా
సరసిజగర్భురాణి యనెఁ జయ్యన "రామకవీంద్ర దీనికిన్
సరగున వ్రాయఁబూను టతిసాహసకార్యము మాను మిప్పుడే
స్వరపదసంచయంబుగల వాఙ్మయభూమిక సృష్టిసేతు న
త్తఱి లిఖియించు టొప్పగు సుధామధురోక్తుల" నొక్కమాట ని
త్తఱిని లిఖింప నాజ్ఞయిడె దాసిన యాదలఁ దాల్చి పల్కెదన్
'నరునకుఁ బద్మగర్భునకు నాగకులేంద్రునియంతవానికిన్
గరమును దుస్తరంబు' మఱునాటికిఁ జేరుచు దక్షిణాగ్రమున్
దొరలెడు పెద్దరంగములఁ దూరుపుదక్షిణపశ్చిమాబ్ధు లే

*Varkala అనుస్టేషను Trivendram నకు 6 మైళ్లువెనుకఁగలదు. వర్కలకుక్రోసెడుదూరమునజనార్దనముగలదు. అచ్చటిజనులు జనార్దనమునే వర్కలయని వ్యవహరింతురు. ♦అనంతశయనము.

ర్జెలి నొకతైనచోటు ప్రకృతిప్రమదాననభూషణంబునై
పోరిసి దివాకరాస్తమయముఁ బొడుపుం దగ నొక్కచోటనుఁ
విరివిగఁ జూడగాఁ దగియు విన్న విభిన్నము గాని చోటు నా
కరమయి సుందరాకృతికిఁ గన్యకుమారియటన్న పేరిటన్
బరఁగు హిమాచలాత్మజకుఁ బ్రాభవ మబ్బినచోటు నద్భుతా
కరముగదక్షిణాగ్రముదకంబునఁ జొచ్చిన చోటుగంటి మ
ప్పరమదయాస్వరూపిణి ప్రిభానిధి కన్యకుమారినాసికన్ ౧౮౦
దరుణమనోజ్ఞవజ్రిమణిధాళధళంధళ ధాళధళ్యవి
స్ఫురదురుకాంతిపుంజములు చూపులకు న్మిఱుమిట్లుగొల్ప న
బ్బురపడి చూచి యర్చనలు పూర్తియొనర్చితిమార! దేశస
చ్చరితములన్ వెలుంగు నొకసంగతి కన్యకుమారినాసికన్
వరలెడిదంట వజ్రిమణి వార్ధిని బోయెడియోడమూఁక కా
నరమణినుండి వెల్వడిన భాస్వరకాంతులు తోడునీడలై
పరఁగెడివంట స్పష్టముగఁ బల్కుడు రచ్చటిపౌరు లద్దియే
యరుదగు "లైటుహౌ"సగుచు హార్వ్వహించినదంచు నంతటన్
దిరుసలివేలినాఁ బరగు దివ్యపురంబును జేరి తాపసం
హారమగు తామ్రిపర్ణి విమలాంబుచయంబున దోఁగి నాకమో
హారి నిజపట్టణమ్మనయన హర్వ్వనమించు *శిరంగపట్నముర్
సరవినిఁ జేరినార మది సాలము లేడిఁటఁ బెంపుమీఱు ముం
దరఁగలమూఁడుసాలములదవ్వనుపట్నము తక్కనాలుగుర్
వఱలును రంగనాయకుఁడుపాయనిచోటయి దేవళంబులో
వఱలెడు కట్టుబాటు లొకఫక్కిగ నుండును వైష్ణవోత్తముల్
ఒఱపగునూర్ధ్వపుండ్రిముల నొత్తుగమెత్తియు మోమునిండఁగాఁ

*శ్రీరంగము.

గరము భుజించి పుక్కిటను గమ్మనితమ్ములమాటలూరఁ ముం
దర వెనుతట్టుఁ బింజెగల నాణెపువస్త్రము లంటదోఁపి పే
రురమున నెత్తిచందనము నొప్పఁ ఘటిల్లఁగ 'రంగ! రంగ!' యం
చుఱవడిఁ బాడుచుం గ్రుడి నొప్పెడి యర్చకు లయ్యవార్లకున్
వరుసగఁ బూజసల్పి పరివట్టము నెత్తికిఁ జుట్టి గౌరవో
త్కరములు సల్పి పెన్పడలఁ గమ్మనిదోసెల ముంచి తేల్చు చే
పెరలకుఁ బెట్ట రింతయును వెన్కటి కాలమునందుఁ దత్పురిన్
వఱలెడిదాట 'కంచుకవివర్తనకేళి' యటెంతనిక్కమో
పురజనుఁడొక్కఁడున్ దెలుపఁబోవఁడు గాని తదాలయంబులోఁ
జిరమగుపొన్నచెట్టొకటి చెన్నుసలారెనుఁ జెంతఁ జంద్రపు
ష్కరిణి యెసంగు గోపకులకాంతలతో సటఁ గృష్ణమూర్తి దా
నొఱపరి గ్రీడసల్పె నని యొప్పెడు రంటియచాలుఁ బోవసిం
డరయ 'శిరంగమే' త్రిదివమా గద కావెరి మధ్యఁ బొల్చుఁ దత్
త్పరిదమలాంబుశీకరపుఁదావి రవంతయుసోఁకెనేనియున్ ౨౧౦
నరులయఘమ్ము లీలుగు ననారతమున్ శుభమబ్బుఁ గాన జా
పురె సరిలేవుగా నదులు పోల్పఁ బవిత్రతరంబు ముక్తిదం
బురుధిషణాభిపోషకము నూర్జితమయ్యది యమ్మచెల్ల! త
త్పుర మొకమందసంబునకుఁ బోల్పఁగవచ్చును లోంటితల్పు శ
ర్వరులను మూయఁగా నఱలఁ దక్కిని బొల్చును తక్కసాలముల్
కరములిలాసమూర్తి యయి కాల్చుచుఁ గన్నుల మోదమిచ్చుచున్
బరిమళపుష్పయుక్తకచపాళి నెసంగెడు ద్రావిడాంగనల్
ఇరుగడలందుఁ జామరము లేత్తెఱ వైవగ నొప్పువానిఁ గ
స్తురితిలకంబువాని సిరితోఁ యవ్వాలికిం దమి గొల్పువాని ని
ర్భరముగ నింద్రనీలరుచిరమ్మగు పొల్చెడు మేనివానిఁ జే

రురమునఁ గౌస్తుభాభరణ మొప్పెడువానిఁ బ్రసూనశయ్యపై
నోఱపుగఁ బండువానిఁ గని యుల్లము పొంగఁగ నల్లదేవునిన్
ఉరుతరవైభవాఢ్యయయి యొప్పెడుదేవిని రంగనాయకీ
పరమపతివ్రతామణిని భాసురవైభవరాజిఁ బొల్చు కా
వెరి నవపావనాంబువుల వెల్లులఁ బెల్లుగఁ దానమాడి త
త్పరమతితోఁ బ్రభాతమున ధ్యానసమార్చనఁ గొల్చినార మ
చ్చెఱువయి యాలయంబునకుఁ జేరువ మాఱెడొకండువొల్చు నీ
శ్వరుఁడనుమాట కర్ణములఁ బాఱెనఁ జిందులుద్రొక్కు వైష్ణవుల్
నఱుకఁగఁ బెక్కుసార్లు మఱునాటికిఁ దత్తరు వేపుసూపుచున్
బెఱుగఁగఁజొచ్చె నొక్క నిశిఁ బెద్దలఁ బెద్దగు నయ్యవారికిన్
గర మగుపించి స్వప్నమునఁ గావేరిరంగఁడు 'బాలిశుండ!' యీ
ధరణిజ మస్మదీయమగు ధాత్రి రవంతయు భేదభావముం
బొరయదు నాకునున్ భుజగభూషునకున్ వినుమంచుఁ బల్కె నం
దు రదిమొదల్ మఱెవ్వరును దూషణసేయరు తద్ద్రుమంబు నం
తరమున *నీటిలింగమయి ధారుణిపై నెసలారు జంబుకే
శ్వరమున కేగి యచ్చోటను జంబుపతిం గడుఁ బూజసల్పియున్
అరుణరుచిప్రకాండయగు నయ్యఖిలాండమహేశ్వరీమహా
చరణములాశ్రయించి ×ట్రిచిసారమహీధ్రమునందుఁ బొల్చు నీ
శ్వరుఁడగు మాతృభూతు పదపద్మము లంత సుగంధికుంతలా
ఖ్య రహి వెలుంగునీశ్వరి పదాబ్జయుగంబునుగొల్చినార మం అరం
దరసిన చిత్రలేఖన పుటందముఁ జెప్పఁ దరంబుగా దికం బ్రభా
స్వరమగు విద్యుదాభలకుఁ బట్టయి జ్యోతిరభిఖ్యయై మనో
హరమయి తేజరిల్లు ♦నరుణాచలశంభునిఁ బూజసేసి త

*అప్లింగము. × తిరుచునాపల్లికొండ. ♦ తేజోలింగము.

త్పరిసరమందు నీశ్వరుఁడు దారసహితుఁడు చాంబ భక్తితో
నరసితి మాలయంపుసాగ సద్భుత మాపురినున్న సత్రిమా
గోటులు సమస్తసౌఖ్యములకున్ నిలయంబయి వాహనంబులున్
వఱలుఁ బసిండివెండిబిగిసౌజు సెలంగుచు చూసి పిడుచున్
బురవరసప్తకంబునను బొల్చుచు నొంటయి మోక్షదాత్రియై
కరమరుదైన కంచిపురిఁ గాంచితి సంచితపూర్వపుణ్యభా
స్వరవరవాసనాపటిమఁ బావనమై కడుఁబూజనీయమై ౨౧౦
స్ఫురితసుశాఖలం బొలుచు చూతమహీరుహ మాలయంబునన్
వఱలుచునున్న దిప్పటికి వారక శంభుఁడు చాలకాల మా
తరువున నిల్చి నిష్ఠమెయి దారుణభూరితపంబు సల్పె నా
ల్గురకములౌ ఫలంబుల నకుంఠితరీతి ఫలించుచుండు న
ద్ధరణిరుహంబు నందుఁగల దైవము ♦నేకరసాలుఁడండ్రు రా
పురమున సర్వతీర్థమనుభూరితటాకము కల్గియున్న దా
నరయఁగఁ *గామనేత్రి శివునర్ధశరీరముఁ దాల్చి భక్తులం
బరమదయారసంబుమెయిఁ బాయక ప్రోచును శైవమిద్ది త
త్పరిసరమందు వైష్ణవము తాండవమాడుచునుండు గండుమీ
ఱ రహి వెలుంగు సవ్వరదరాజులఁ గొల్చితి మువ్వురందునన్ ౨౬౦
సరిగొనుఁ బాపరాశి వరుసన్ శివకంచియు విష్ణుకంచినాన్
సురవరవర్ణినీమణుల సోయగమున్ గని గేలిసేయు న
య్యాఱవనితంబినీమణుల యందము చందము లెందుఁ గల్గునే
తఱచగు గందపుంబసుపుతావి గుబాళ్లను మేనికాంతితోఁ
జరణముదాఁకఁ బట్టుబురుసాపనిచీరయు ఱైకనాఱఁగా
మెఱయుదు రాత్మసౌధముల మింటఁ బడిల్లుతలట్టు లంత వా

♦ఏకామ్రేశ్వరుఁడు.  *కామాక్షి.

సరములతావు దోషములనందగుభూరిశిలోచ్చయంబులన్
సరవినిఁ గొల్చువజ్రిము నిసర్గమనోహరధామమైన పెన్
జటియలకిక్క భీకరవనంబులకెల్ల నిధాన మందమై
పరిమళబృందమై నయనపంకజభాస్వరకందమై శుభం
కరమయిమేలితావులను గ్రిమ్మెడు చందనకోటికున్కి మే
ల్మెఱుఁగులమెట్లు కిమ్ము నలమేఘుఁడు మేఁతకు వచ్చుతావు ని
ర్ఝరముల కాటపట్టు గిరిరాజము లేడిట వెల్గుకొండయా
తిరుపతి కేగినార మలదేవుని భూరిమహత్వమెన్నఁగాఁ
దరమె? మదించి గర్వపరిధానముగట్టినచక్రవర్తులన్
జరణము నేలమోపని నృచంద్రుల నిర్జితనాకనాథులన్
శిరములఁ బట్టి పాదములచెంగటికీడ్వఁడె వెండి యొండక
న్నెఱుఁగని సుందరీమణుల నింతయు ముట్టినఁ గందువారలన్
జరను గృశించి ముగ్గు ముదుసళ్లను గూఁటను వేగ కొండకున్
గిరగిరత్రిప్పి తీసికొని కేవలభక్తినిఁ గొల్చుచుండఁడె జి
చ్చుఅపిడుగట్లు ముట్టుటకు శక్యముగాని సతీశిరోమణుల్
చరణములందు సూదిమొనచందమునన్ జెఱురాలు దూర దు
స్తరమగు నేడుకొండలను దాఁటుచు మంగలివాని యంటక
త్తెఱలకు నప్పగింతురుగదే తలలం గడుభక్తిమీఱ బల్
విరివిగ విత్తముండియును బిల్లికి బిచ్చము పెట్టనంటు ము
ష్కరుఁడగులుబ్ధుఁ డేనయినఁ గాసులునున్ మొహరీలు రత్నముల్
గురియఁగఁజేయఁడే చిటుకలోఁ బ్రతివత్సరమందు యాత్రికో
త్కరములవల్లనే పదునొకండగులక్షలరూక లబ్బు న
బ్బురమదియెందుగల్గుఁ బరిపూర్ణయశోనిధి వేంకటేశు పం
కరుహచయంబులందెగడు కన్గవ సంపెఁగ గేరు నాసమున్

వరరుచు లీను రత్నమయనామము హారికిరీటమున్ మనో
హారమణికుండలంబులును హాసము లీనెడు ముద్దుమోము సుం
దరపదపంకజంబులును దళ్తళలీనెడు కాలియందెలున్
మెఱసెడు పైడిదువ్వలువ మేఖల నొప్పు మహాసముచ్ఛ్రయం
బురమున వైజయంతి సిరియున్ గరయుగ్మమునందు శంఖచ
క్రరుచులుఁ దారహారములుఁ గంఠమునందు వెలుంగునట్టి భా
సురుఁడగు దేవదేవుఁగను చూడ్కులెచూడ్కులుకొండక్రింద నా
తిరుపతివేంకటేశ్వరుని దేవి బళా! యలివేలుమంగ త
త్పురమును నాపెపేరిటన పొల్చుచునున్నది యుత్సవంబటన్
జరుగు మహావిభూతిమెయిఁ జక్షురపేక్షితమౌచు సంత *శ్రీ ౩౦౦
ద్వారసహస్తికిం జని తదీయసువర్ణముఖీనదీప్రపూ
త రససుధాప్రవాహములఁ బానము బానముసేసి యీశ్వరున్
గరమభిషేకపూర్వముగ గాఁపుభక్తిని జ్ఞానసూసనా
బరఁగు మహేశ్వరీవిమలపాదములన్ భజియించినార మ
ప్పురమునఁ గల్గుగోపురము పుష్కరమంటుచురీతి నొప్పు న
ర్వరఁ గలపంచలింగసికరమ్ములలో నిది వాయులింగమై
కరము నిదర్శనంబగుచుఁ గన్పడు లింగము ముందుభాగమం
దు రహి వెలుంగు దీపిక యుదగ్రముగాఁ జలియించుభంగి ని
ష్పురములఁ బోలు పుణ్యపురపుంజములన్ గనఁ గాలుసేతులున్
సరినెసలారుపట్టుననె సాగవలెన్ జను డింక మీరలున్. ౩౦౧

వ. ఇట్లు భక్తిపరాయణుండయి రాముం డెల్లవారలను తద్యాత్రా
వర్ణనాకర్ణనాకౌతూహలాయత్తచిత్తులఁ జేయుచుండ నిక్కడ
సుందరి రామవియోగంబున నిరలంకారయు, నిర్నిద్రయు నిరా

* శ్రీకాళహస్తి.

హారయు నిరంతరరామనామధ్యానాసక్తయునై జనకాత్మజాత విధంబున వర్తించుచుండె. రాముఁడూరిలోనికి వచ్చి నాలైదుదినంబులయ్యె నాతని పనియేమో యాతఁడేమోకాని తనమాటైనఁ దలపెట్టుట లేదని యెఱింగి యాతఁ డింక రాఁడని నిరాశచేసికొని వలపుచే ఉప్పొంగి ప్రవహింప వాని గుణగణంబుల గణించుచు నిట్లు విచారింపఁ దొడంగె. 66

ఉ. వాని వచశ్చమత్కృతియు వాని మనోహరరూపరేఖలున్
వాని విలాసవైఖరియు వాని వినిర్మలప్రేమతత్త్వమున్
వాని వదాన్యతాగుణము వాని కవిత్వపటుత్వభంగి మ
న్మానసదర్పణంబున ననారతమున్ బ్రతిబింబమందెడున్. 57

కం॥ మురిసితి నీవుంజోఁడని
మురిసితి రసికావతంసము దొరకె ననుచున్
మురువొక్కపెట్టఁ గూలెను
పెఱుగుట విఱుగుటకె యన్నవిధమున నకటా! 58

ఉ. ఎంతవివేక మెంతచదు వెంతకవిత్వపటుత్వవైభవం
బెంతవిలాస మెంతకళ యెంతయొయార మి కెంతరాయసం
బెంతయుదారమాహృదయ మెంతరసజ్ఞత యెంతప్రేమ నా
యంతయదృష్టహీన కిఁక నంతగుణాఢ్యుఁడు దక్కనేర్చునే. 59

కం. ఏరీతి రతులఁ బెనఁగితి
మేరాతిరి యెట్టులుంటి మెఱుఁగవొకో! 'రో
ళ్ళా రోకండ్లం బాడిన'
కూరిమి యంతయును నేలఁగూల్చితివె ప్రియా! 60

చ. తిరుపతి గంచియున్ ♦శకునతీర్థములాదిగఁ గాళహస్తిలోఁ
బరఁగినదైవతమ్ములకు భక్తిని మ్రొక్కుచుఁ జచ్చుదాఁక నోం

♦ పక్షితీర్థము.

వారలను వీడకుండుమని పొట్టను బెట్టితి విప్పు డందులో
హరహర! యొక్కదైవమును సద్దుపడం డదియేమికర్మమో! 61

ఉ. కన్నని సతితోఁ గలిపికట్టిన మేలిమిసున్నియుండ నో
కమ్మగు నావుపాలు చిలుకన్ మిసి దీసిన వెన్నముద్ద ని
కమ్ముగఁ జింతగింజ మునుకం బడనేరని పాలు భక్తిభా
గ్యమ్మున నీకొసంగుసుఖమంతయు నేటికిఁ దీరెనే ప్రియా! 62

కం. సరసంబులు చిఱునవ్వులు
మురిపెంబులు వలపుగురియుముద్దులమాటల్
తరితీపు లక్కరగింతలు
మఱపునకును రావుగాదె మఱచెదమన్నన్. 63

మ. కనదుత్తుంగమనోజ్ఞహర్మ్యముల విఖ్యాతంపుఁదీర్థంబులన్
ఘనకౌతూహలయుక్తిమైఁ దలఁప కేకష్టంబులున్ సన్ను నో
డన కొంపోవుచుఁ బాపపుణ్యములజాడల్ దెల్పి జన్మంబు పా
వనముం జేయుచు గారవింపవె ననున్ బ్రాణంబు ప్రాణంబుగా.

కం. ఇడుములకోర్చి నిన్నె
మెడసూత్రముగట్టిన పెనిమిటివని యెంచన్
గడకిటు నిర్హేతుకముగఁ
దడిగుడ్డను గొంతుఁగోయఁ దగునే ప్రియుఁడా! 65

సీ. ధనదునాత్మజుఁడైన దరికి రానీదురా
యని యందరును జెప్పుకొనఁగ బ్రతికి
యేకాంతయునుగూడ నీకాంతకునుసాటి
రాదన్న ప్రజలగౌరవము లంది
మాజాతి కిది తలమానికంబని కుల
స్థులయందు మేటిప్రస్తుతులు వడసి

ప్రాణంబులకు నెల్ల ప్రాణంబుగా మీరు
స్నేహసౌభాగ్యంబు నెఱపనడచి
గీ. యిద్ధగుణశీలములను ప్రసిద్ధిగాంచి
కడకు విడనాడఁబడినట్టి పడఁతియనెడు
పరిజల నిందకు లోఁబడి బ్రతుకుకంటె
మరణమే చాలశ్రేయమ్ము మానవతికి. 66

ఉ. ఎంతయు నాపరాధివగ యోఁచఁగ నాసతిచింతనొంది త
త్కాంతుఁ బిశాతకుంతహతి గాఢమనఃపరితాపవేదనా
క్రాంతతఁ గుంది యీదృశపరాభవజన్మ మికేల యంచు గే
హాంతరమందు జొచ్చి వల పంచితభక్తియుమున్మరింపఁగన్. 67

వ. ఏరికిం దెలియనీయక తనయాస్తి నెల్ల రెండు 'వాటాలు వేసి' మె
ట్టువాటారామునకును రెండవవాటా తల్లికిని సోదరులకును జెం
దవలయుననియుఁ జిత్రచిత్రంపురజతసామాగ్రి యంతయు రాము
నకే చెందవలసినదనియు శాసనము వ్రాసి తలాడక్రింద నునిచి
కడసారిగా రామున కుత్తరము వ్రాయనెంచి కాగితముం గల
ముం గైకొని 'శ్రీమత్కవికులసార్వభౌములగు శ్రీరాములవారి
సన్నిధికి విూదాసురాలగుసుందరి నిర్భర ప్రణయపూర్వకంబుగా
నమస్కారంబు లొసంగి వ్రాసికొను కడసారి మనవి. 68

ఉ. ఇప్పుడొ యింకనో యిచటి కీరరుదెంతురటన్నయాశచే
గుప్పిటఁబట్టి ప్రాణములఁ గూలగఁదోయక నిల్పియుంటి నే
నిప్పటిదాఁక వత్తురని యేమియునాశ జనింపదింక నా
తప్పు క్షమించి రండు తమదాసిని నొకగడసారి చూడఁగన్. 69

ఉ. నన్నటు మీరు వీడినదినంబుననుండియు నన్నపానముల్
కన్నన సున్నయయ్యె మిముఁ గాంచమిచే నిముసంబు కల్పమై

యున్నది యెంతవేఁడిన నయో! దయదాల్ప వొకింతయైన వి
ద్వన్నుత! చూడఁగా మొగము వాఁచిన నా మొఱ నాలకింపుమా!

వ. నేనిదే విసము మెసవనుంటి. మీరు వచ్చువఱకుఁ బ్రాణ ముండి కడసారి మీ ముఖారవిందదర్శనంబు చేయుదు నా ధన్యులాలసే. తొల్లి మన సల్లాపంబులయందు "మీ చరణదాసినగు నేను మరణింతునేని నాకుఁ బరలోకక్రియలు యథావిధిగా జరిపింపుఁడని నేను కోరఁగా నాప్రతికటువుమాట వినవొల్లమి వో నాయెడంగల వలపువలననో నాపైఁ గస్సుమని తిరిగి నాయొత్తిడి వాక్యంబులచే 'సరేలే' యని యూరకుంటిరి. ఇప్పు డదియే నాతుదికోర్కె యని వేఁడుకొనుచున్నదాన. నాథా! నాకిం కే బాధయు లేదు కాని యొక్క విచారము మాత్ర మెక్కుడుగా బాధించుచున్నది. 71

గీ. నేను మరణింపఁ బిదప నా నిజము తెలియ
మీ విచారాంబురాశికి మేరయుండ
దని విచారింతునే కాని యనఘ! నాదు
చావునకునంత నేను విచార మొంద. 72

సీ. ప్రావృట్పయోదసంభవపయస్సంసక్త
చాతకం బరుగునే చవిటిపడెకు
ఘనఘనాఘనరవాకర్ణనాసక్తమ
యూరము వినునె ఝిల్లీరవంబు
మానసకాసారమధురజలాసక్త
కలహంసి కోరునే క్షారజలము
శారదచంద్రికాహారసంసక్త చ
కోరము కోరునే కుటిలకాంతి

గీ. సరససంగీతసాహిత్యసత్కవిత్వ
వైభవంబునఁ దేలు మీపయినిఁ దవిలి
చీకుఁజింతయు లేని నాచిత్త మింక
నితరమును జెందనేర్చునె యెన్నఁడేని. 73

భవత్పదదాసి,
సుందరి.

వ. అని వ్రాసి . 74

ఉ. రాముని మేల్పటం బెదుట రాజిలఁజేసి కరాబ్జయుగ్మ మెం
తే మహితంపుభక్తిఁ బయి కెత్తి మహేశ్వర! జన్మజన్మకున్
రాముని నాకు భర్తగ విరాజిలఁజేయు మటంచు మ్రొక్కి య
కోమలగాత్రి మ్రింగె నతిఘోరవిషమ్మును సాహసమ్మునన్

వ. అంత నక్కాంత యున్నపాళముననే పడిపోయె నామె నిర్భరాను
రాగము సత్యమే యనునట్లు గడియారంబు టంగు టంగునఁ
బదునొకండుగంటలు కొట్టె. 76

చ. పదియునొకండుగంటలకు భామకుఁ ద్రిప్పు జనించె హస్తముల్
పదములు లాగఁజొచ్చె ముఖపద్మము వాడఁదొడంగె బిట్టు గ
ద్గదిక ఘటిల్లె నాడి కడకన్ వెనులాగెఁ దదీయవార్తయున్
బ్రిదులుచుఁ బ్రాఁకె నీటిపయిఁ బేర్చిన తైలపుబొట్టురీతిగన్. 77

వ. ఇంటిలో నందరును కంగారుపడి కాలుసేతులు కలయఁద్రొక్కు
కొని కొంపగూలెనని గొల్లున గోలపెట్టఁదొడంగిరి తోచియుం
దో చనియప్పుడెల్ల నెల్లవెలమోంత్రి యుండుల కేగుశంకరుండను
విచిత్రప్రవర్తనాయత్తుఁడగు మానవుం డప్పురంబున నొప్పుమీా
రు నాతఁడు సుందరిని నామె పక్కనున్న రామునిచిత్రఫలకం
బును తత్సమీపస్థలేఖను చూచుటతటస్థించెనంతఁ బరోపకార

పరాయణుండగునాతఁడు తటాలున లేఖనుదీసికొనిపోయి రాముని
కందీయనెంచి యాలసించిన నాసుందరికిఁ బ్రాణభీతి గలుగునని
యెంచి మున్ముందు వైద్యునన్వేషించి పంపినవెనుక రామునకు
లేఖ నీవచ్చునని పర్యాలోచన మొనరించి వైద్యు నన్వేషించి
సుందరీగృహంబునకునంపి రామున కా లేఖ నందీయంజనె. రాముఁ
డాకమ్మ నందుకొని యామూలాగ్రంబుగాఁ జదివి యంతము
లేనిసంతాపమునఁ దత్క్షణ మాసుందరీమందిరంబునకుఁ బోవుచు

చ. ఇలఁగలపాతకక్రియల హింస కడుం ఘనమండ్రుగాదె కాం
తలయెడ నంతకంటెను ఘనంబని పల్కుదు రందుఁ దానయై
వలచినసుందరాంగి నిటు వంతలఁబెట్టినయట్టినాకు ని
క్కాల యికఁదీరనేఱుచునె కోటివ్రతంబులు చేసినం గటా! 79

శా. రేపో మాపో మదీయసుందరినిఁ బేర్మిం గాంచి తప్పొప్పుకొం
దాపైనం చనునంతఁ బొంగె నొగి దుఃఖాంభోధియుం దక్కునో
చూపైనన్ మరి దక్కదో విధికృతుల్ చోద్యంబులౌనే కదా
యేపాపంబు నెఱుంగనట్టిసతికా యీవ్రాత సర్వేశ్వరా! 80

వ. అని విచారించుచు సత్వర మాసుందరీమందిరంబునకుఁ జనె. 81

మ. కనుదమ్ముల్ ముకుళింప దేహలతయుం గంపింప ఘూర్ణంబుబిం
దునికాయంబు లెసంగ నిశ్వసనసందోహంబు రెట్టింపఁగాఁ
గొనప్రాణంబుననున్నసుందరినిఁ గన్గోఁ బోయి రాముండు గొ
బ్బునఁ గన్నీరిడి చేష్టదక్కి నిలిచెన్ మ్రోడుంబలెన్ నెవ్వగన్.

వ. అందరును నైరాశ్యంబుఁ జేసికొని గొల్లున నేడ్వఁదొడంగిరి. ఆ భి
షగ్వరుండును నిజశక్తియుక్తుల నుపయోగించి యౌషధసేవ
సేయించుచుండెఁ గాని 'లాభమేమియు లేద'ని రామునకు సూచిం
చుచుండెఁ రాముండు పొంగివచ్చు దుఃఖవార్ధికి ధైర్యంపుటడ్డ

కట్టఁ గట్టి చిత్తంబు దైవాయత్తంబుచేసి 83

చ. పలుకనయే నళీకములు పాడి దొఱంగనయేని వైరికే
దలఁపనయేని హాని యొకనాఁడును జాలిని వీడకుండునే
ని లలితవర్తనంగలఁచి నీతిదొఱంగనయేని సుందరీ
లలనకుఁ బ్రాణభీతియుఁ దొలంగి చెలంగుత మిప్పు డొప్పుగన్.

వ. అని శపథం బొనరించె నంతఁ గొంతవడి కారాముని సౌహార్ద
పరిభావంబునను వాని పవిత్రసత్యప్రవర్తనార్జవంబునను

చ. కమలినదేహ మిద్ధరుచిఁ గ్రాలఁదొడంగెను నేత్రపద్మముల్
విమలములై యెసంగి కడువిచ్చెను హెచ్చెను నాడియుఁ గ్రమ
క్రమముగ నొడ్డుగూల కలకంగని తేఱినయేఱుపోల్కి నా
రమణి వ్యథాభరం బుడిగి రాజిలఁజొచ్చె నవీనకాంతులన్. 86

వ. ఆగుణవతి యారోగ్యవర్ధమానగాత్రియైనివ్వటిల్లుకొలంది. 87

ఉ. ఎప్పుడుమాటలాడుతఱి నేమని దెప్పునొ యంచు రాముఁడె
ల్లప్పుడుఁ దా భయంపడుచు నాఱడిసేయక పల్కఁజొచ్చెడిన్
దప్పులొనర్చువానిమది తల్లడమందుటెకాని నాథు లే
తప్పులొనర్చినన్ సయిచి తామరసాక్షులు భక్తిఁ గొల్వరే. 88

చ. సకలకలాఘుసాధనకుఁజాలిన యాసతి భూరిసద్గుణ
పరికరము నెంచి యామె యనురాగసముద్రపులోఁ దెఱుంగఁజా
లక తన తొంటితప్పిదములన్ క్షమియింపుమటంచు రాముఁ డా
సకియను వేఁడుకొంచు బిగిసందిటిపంజరమందుఁ జేర్చుచున్.

చ. మఱచి యొకింతసేపు పెనుమ్రాఁకువిధంబున నిల్వ వాని న
ప్పరమపతివ్రతామణియు వారని ప్రేముడిఁ జూచి నాథ! యి
క్కరణిని మీరొనర్ప నెటుగా సయిరింతు క్షమింపు డింక మీ
చరణసరోరుహంబులకుఁ జాఁగిలి మ్రొక్కెదనంచు వేఁడఁగన్.

చ. అడఁచుచు శంక రాముఁడును నార్ద్రమనస్కుత నిష్ఠురోక్తులన్
నుడువక సుందరీసతి కనూనముదంబును గూర్చె సాధ్వితా
పడఁతుల కెంతయున్ జడిసి భాస్కరుఁడున్ యముఁడున్ ద్రిమూర్తులున్
గడగడలాడుచుండ్రు త్రిజగంబులు గూడను దద్దరిల్లెడున్. 91

చ. అవిరళవృద్ధిగాంచి యెసలారెడు మోహము ముమ్మురింప జ
క్కవకవమాండ్కి గువ్వకవ కైవడి నాకవ హాయిమీఱఁగా
రవరవ లేకయే సుఖతరంబుగఁ గాలముఁ బాయఁద్రోచెఁ జీ
కు వదలి చేవ వచ్చెనని కోమలి యెంతయు సంతసిల్లఁగన్. 92

కం. మధురాలాపమ్ములఁ బ్రే
మధురాలాలసులగుచు మహిళారాముల్
మధురాజమునఁ బరస్పర
మధురాధరసారనిషుల మథనము సలుపన్. 93

సీ. వారుచూచెడి వాఁడివాల్జూపులగణంబు
శ్రీపుత్రు నిశితంపుఁదూపువాజు
వారుపల్కెడి కుల్కుపల్కులనిచయంబు
మనసిజు సమ్మోహమంత్రచయము
వారుసంస్పృశియించు పట్టులన్నియుఁగూడ
నతనుకళారహస్యస్థలములు
వారుభావించు భావనలసందోహంబు
దర్పకగోష్ఠికదంబకంబు

గీ. వారివలపుటల్కల పెక్కు వారిచొక్కు
వారిమక్కువసిక్కు నవ్వారిటెక్కు
వారిరుహగర్భునకు నియద్వారిపలికి
వారిరుహనేత్రునకునైన వశముపోగద. 95

ఉ. రామునివంక నింక వలరాజునకుం గసిదీఱకుంటనో
యాహామనీయ ధార్మికుల యద్భుతమోహరసంపుఁ బేర్మినో
మోములముద్దులుం గలికిముచ్చటలుం బిగికౌఁగిలింత లెం
తే మితిమీఱె నవ్వలపు టేటికిఁ బాటను మాటయున్నదే! 96

ఉ. పేర్మిపయోధివీచికల రేఫునుమాపును దేలియాడుచుం
రాముఁడు సుందరీహృదయరంజకుఁడుం నిజమానినీమన
స్తామరసాళియై మిగుల ధన్యత దక్షిణనాయకక్రియో
ద్దామతమీఱఁగా మెలఁగెఁ దద్దయు నుజ్వలమూర్తియోయనన్.

— ఆశ్వాసాంతము —

కం. శాంతగుణనిశాంతా! ది
గ్దంతావళదంతకోటితలవిశ్రాంతా
త్యంతయశోజ్యోత్స్నాద్యుతి
సంతానాక్రాంత! ధర్మసహితస్వాంతా!

ఉ. భావితదాన వైభవ! భవస్ఫురి[illegible]ాంఘ్రిసరోజయుగ్మవీ
ఢీవివశాన్వహాభ్రమదతిస్థిరమానసమానసోద్భవా!
భావభవాభిరూపవిభవప్రభవా! ప్రభవానురూపవి
ద్యావినయాదిసద్గుణకదంబ! లసద్భవ!సత్కులోద్భవా!

స్రగ్విణి:- నారయాఖ్యక్షమానాయకాత్మోద్భవా!
సారసాక్షీమనస్సారసాహోధవా!
స్ఫారవిశ్రాణనప్రక్రియానిస్తులా!
భూరివిక్రాంతివిస్ఫూర్తిమద్దోస్థలా!

## గద్య.

ఇది శ్రీశిష్టావంశపయఃపారావారరాకాకైరవమిత్ర శ్రీ సూర్య
నారాయణశాస్త్రిపుత్ర బుధజనవిధేయ వేంకటసుబ్బయ
నామధేయ ప్రణీతంబైన హృదయాభిరామమను
మహాప్రబంధమునందుఁ సర్వంబును
జతుర్థాశ్వాసము
సంపూర్ణము.





# శుద్ధపత్రిక.



| పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 12 | కుమారరాజా | రాజకుమార్ |
| 9 | ప్రథితకుమా | ప్రథితకుమైక |
| 7 | పతుయదృష్ట | పతులయదృష్ట |
| 2 | చరించు | చరియించు |
| 1 | మఱుచటి | మఱుసటి |
| 6 | మనసునకు | మనసునకును |
| 18 | బక్ర్కను | బ్రక్కను |
| 6 | పడుపుఁగొమ్మల | పడపుఁగొమ్మల |
| 3 | జక్కరా | జక్కఁగారా |
| 11 | గొల్లగొట్టుఁగఁజాలు | గొల్లలాడఁగఁజాలు |
| 12 | లేమింఁ | లేమిఁ |
| 16 | మొసంగినను | మొసఁగినను |
| 11 | మైశ్వరాఢ్యు | మైశ్వర్యాఢ్యు |
| 4 | చిత్తమనువద్దంబందు | చిత్తముకురంబందైన |
| 24 | నేగతినోర్తు | నేనెటులోర్తు |
| 21 | పరమయోగీంద్ర | పరమయోగీంద్రబృంద |
| 1 | ఉత్పలమాలిక | చంపకమాలిక |
| 16 | యూర్జితంబునయి | యూర్జితంబయిన |
| 4 | మాన్యము | భవ్యము |
| 14 | సలిలమ్ముల | నివహమ్ముల |
| 18 | నట్లగుటఁబెద్దలు | నట్లగుటనేకద |
| 21 | గాదికంబ్రిభా | గాదు భా |